# వైజ్ఞానికరంగంలో మన కర్తవ్యం



రచన:
మా - సి - యంగ్

అనువాదం:
కొండేపూడి లక్ష్మీనారాయణ



జాశక్తి ప్రచురణాలయం - బెజవాడ

కామ్రేడ్స్!

రచయితలకీ, ఆర్టిస్టులకీ, మన విప్లవోద్యమానికీ మధ్య వుండవలసిన సరియైన సంబంధాన్ని గురించి, మన అభిప్రాయాలను పరస్పరం తెలుపుకుని చర్చించేందుకే ఈ సమావేశం ఏర్పాటు చేయబడింది. మన విప్లవ సారస్వతాన్నీ, కళలనీ అభివృద్ధిపరచడానికీ, మన ఇతర విప్లవ కార్యకలాపాలకి ప్రోద్బలమిచ్చేనిమిత్తం వాటిని సమీకరించడానికీ చేసే ప్రయత్నాలలో ఇది ఒకటి. దీనిద్వారా మన జాతికి శత్రువులైనవారిని ఓడించగలం. మన జాతి విముక్తిని సాధించగలం.

చైనా విముక్తికోసం మనం జరిపే పోరాటంలో అనేక రంగాలున్నాయి. వాటిలో వైజ్ఞానిక రంగం, మిలిటరీ రంగం చాల ప్రధానమైనవి. ముఖ్యంగా శత్రువును ఓడించడమనేది, తుపాకి చేబట్టిన సైనికులమీద ఆధారపడివుంటుంది. కాని, సంపూర్ణవిజయానికి సైన్యం ఒకటే చాలదు. తుపాకులతో పోరాడే సైన్యానికి తోడుగా ఒక ప్రత్యేక వైజ్ఞానికసైన్యం (కల్చరల్ సైన్యం) కూడా కావాలి. మనలో ఐక్యతను సమకూర్చడానికీ, శత్రువును ఓడించడానికీ ఈ కల్చరల్ దళాలు తప్పనిసరి అవుతాయి.

1919 మే 4 తేదీని ప్రారంభమైన ఉద్యమం చైనాలో ఒక వైజ్ఞానిక సైన్యాన్ని సృష్టించింది. చైనా విప్లవానికి ఈసైన్యం చాలా తోడ్పడింది. సామ్రాజ్యవాదులు దండయాత్ర చేసి చైనా మీదరుద్దిన ఫ్యూడల్,బానిసవిజ్ఞాన ప్రభావాన్ని ఈసైన్యంక్రమక్రమంగా తొలగించింది. ఈరోజున ఆ విప్లవ వ్యతిరేకులు ఏస్థితిలో పడ్డారంటే, మన ఈనూతన విజ్ఞానాన్ని కేవలం సంఖ్యాబలంతో తప్పితే నాణ్యమైన రచనలతో ఎదుర్కోలేక పోతున్నారు. ఇంకా విపులంగా చెప్పాలంటే, వాళ్ళకి చేతినిండా డబ్బువుంది. కనక, మంచిది ఒకటి లేక పోయినా ఎక్కువ సారస్వతాన్ని, కళారూపాలను మాత్రం తయారుచేసి వదేస్తారు.

మే 4 ఉద్యమం ఆరంభం అయిననాటినుంచి, మన వైజ్ఞానిక రంగంలో సారస్వతం, కళారూపాలు అనే రెండు ముఖ్యమైనశాఖలు ఏర్పడ్డాయి. ఈ రెండు శాఖలు తమకృషివల్ల తగినంత గౌరవస్థానాన్ని కూడా పొందగలిగాయి. సారస్వతంలోను, కళలలోను బయలుదేరిన విప్లవోద్యమం ముఖ్యంగా అంతర్యుద్ధకాలంలో (1927-37 ల మధ్య) ఎక్కువ అభివృద్ధిపొందింది. కాని, ఈ వైజ్ఞానిక ఉద్యమం, రెడార్మీ సాగించిన మిలిటరీ కార్యక్రమం. ఒకే దృష్టితో నడిపినప్పటికీ . ఈ రెండింటికీ మధ్య దగ్గిరసంబంధం లేకుండా దేనికది విడివిడిగానే వుండి పోరాటం సాగించాయి.

మొట్టమొదట, విప్లవవ్యతిరేకులు ఈ రెండు సోదరసైన్యాలనూ కలవవియ్యకుండా వేరుచేసి వుంచారు. (ఎర్రసైన్యం కియాంగ్సి రాష్ట్రములో చుట్టుముట్టబడింది. వైజ్ఞానికరంగంలో పనిచేసే వర్కర్లు రెడార్మీతో సంబంధం లేకుండా షాంఘైలోను, పీపింగులోను వేరుచేసివుంచబడ్డారు.) ఆ తరువాత జపాను దురాక్రమణను ప్రతిఘటించడానికి సలిపిన యుద్ధం ఒకమంచి అవకాశాన్నిచ్చింది. విప్లవరచయితలను, ఆర్టిస్టులను యెనాన్‌కి, ఇతర ప్రజాస్వామిక కేంద్రాలకీ పంపగలిగాం. కాని అంత మాత్రముచేతే ఈ వైజ్ఞానికదళాలు ప్రజావుద్యమంతో సమ్మిళితమయ్యాయనటానికి వీలులేదు. మనమింకా విప్లవకార్యక్రమాలను అభివృద్ధిచేసుకోవాలి. ఏదోవిధంగా ఈ వైజ్ఞానిక దళాల పన్నిటినీ ఒకదానికొకటి సన్నిహితసంబంధం కలవిగా తయరుచేయాలి.

మన విప్లవకార్యక్రమంలో కళలు ఒక భాగంగా వుండాలి. అయినప్పుడే మనం మన ప్రజల్ని ఐక్యపర్చగలం. వారి విజ్ఞానాన్ని పెంపొందించగలం. మన శత్రువుల్ని ఎదుర్కోగలం. సవాలుచేసి అతని ఆయుధాల్ని నిరుపయోగంగా చేయగలం. ప్రజలంతా ఒకే ఆశయంతో శత్రువుతో పోరాడేందుకు సహాయపడగలం. ఈ ఆశయసాధనలో మనం అనేక సమస్యల్ని పరిష్కరించవలసివుంది. మనస్థానమెక్కడ ? మన దృక్పధమేమిటి ? మన ప్రేక్షకులెవరు ? మన విజ్ఞానాన్ని పెంపొందించుకోవటం ఎలాగ ? అనే ప్రశ్నలు మనల నెదుర్కొంటాయి.

## మన స్థానమెక్కడ ?

కార్మికవర్గం పక్షాన, ప్రజాసామాన్యం పక్షాన మనం నిలబడతాం. కమ్యూనిస్టుపార్టీ సభ్యులయినవారు, పార్టీ అభిమానులు తీసుకోవలసిన స్థానం అదే. పార్టీ సిద్ధాంతాలనూ, పార్టీ పాలిసీలనూ దృష్టిలో పెట్టుకుంటే మన ధర్మమదే. కాని దురదృష్టవశాత్తు నేడు చాలామంది రచయితలకూ, కళాకారులకూ ఈ దృక్పధం లేదు చాలామంది కామ్రేడ్సుకు కూడా ఈ రంగంలో తామెటు నిలబడాలో తెలియదని నేననుకుంటాను.

## మన దృక్పధం యేమిటి ?

మన స్థానమెక్కడనే సమస్యతోపాటు వివిధ ప్రత్యేకపరిస్థితులలో మనం అవలంబించవలసిన దృక్పధం ఏమిటనే సమస్యకూడా వస్తుంది, ఉదాహరణకు దేనినయినా ఎప్పుడు పొగడాలి, ఎప్పుడు తెగడాలి? ఇది దృక్పధానికి సంబంధించిన ప్రశ్న. ఈ రెండూ అవసరమనే అంటాను. కాని ఏదిచెయ్యాలి అనేది ఆయాపరిస్థితులనుబట్టి, విషయాన్నిబట్టి వుంటుంది. మనకి మూడురకాల మనుష్యులున్నారు: (1) మన శతృవులు (2)మనమిత్రులు (3) మనం (మనం అంటే కార్మికవర్గమూ, దాని ప్రధమశ్రేణియైన కమ్యూనిస్టుపార్టీ) ఈమూడురకాల మనుష్యుల పట్ల మూడు రకాలయిన దృక్పధాలను మనం అవలంబించవలసి వుంటుంది.

మన శత్రువుల విషయం తీసుకుందాం. (శత్రువులంటే జపానువారు, ఫాసిస్టులు, ఇంకా ప్రజాశత్రువులైన ఇతరులూ.) వీరిని మనం పొగడాలా ! ఎన్నటికీ కాదు. వీరంతా మానవ నాగరికతకే శతృవులు. గనుక వారిని పొగడవలసిన అవసరం రానేరాదు. టెక్నికల్‌గా చూస్తే వాళ్ళకి మనకంటె ఎక్కువ బలమే వుండవచ్చు. వాళ్ళకి మంచి తుపాకు లుండవచ్చు. మంచి ఫిరంగు లుండవచ్చు. ఇంకా అనేక ఆయుధా లుండవచ్చు. కాని అవి ఎంత మంచి ఆయుధాలైనా వాళ్ళ చేతుల్లోవుంటే విప్లవ వ్యతిరేకశక్తులే అవుతాయిగాని మరోటికాదు. మనకి అన్నీ ఆయుధాలులేవు. మనం చేయవలసిన పనులల్లా వాళ్ళ చేతుల్లోనుంచి వాటిని లాగి వాళ్ళకి ఎదురుతిప్పడమే. అదేసమయంలో

మన వైజ్ఞానిక సైన్యంకూడా ఒక కర్తవ్యాన్ని నెరవేర్చవలసి వుంది. శతృవు చేసే అత్యాచారాల్ని, దుర్మార్గచర్యల్ని ఎప్పటికప్పుడు బయట పెట్టుతూ వుండాలి. వాడి పరాజయం ఎలా తధ్యమో ప్రజలకు విశదీకరించాలి. అభివృద్ధికరశక్తుల కన్నిటికీ ప్రోద్బలమివ్వాలి. సత్వర విజయంకోసం ప్రజలంతా ఒకే హృదయంతో, ఒకే ఆశయంతో పోరాడేటట్లు చేయాలి.

ఇక మన మిత్రుల విషయం: వీరిపట్ల మన దృక్పధం ఎంతసేపూ వారిని ఐక్యపర్చేదిగాను, విమర్శలద్వారా వారి తప్పులను సరిదిద్దేదిగానూ వుండాలి. శతృవును ప్రతిఘటించే వారి చర్యలను బలపర్చాలి. వారు సాధించిన ఘనకార్యాలను అభినందించాలి. అలా అని వారిలో కొందరు కమ్యూనిస్టు వ్యతిరేక, ప్రజా వ్యతిరేక పద్ధతుల నవలంబిస్తే వూరుకోవాలని కాదు. అలాంటి చర్యలను ఖండిచాలి. వారు రోజురోజుకూ విప్లవ వ్యతిరేక మార్గానికి ఎలా దిగజారుతున్నారో స్పష్టం చేస్తూ వుండాలి.

పోతే ఇక మన కార్మికవర్గమూ దాని పోరాటం వున్నాయి. దానితోపాటు ప్రజాసైన్యమైన రెడార్మీ, మనపార్టీ వున్నాయి. సహజంగా వీటిపట్ల మన దృక్పధం వాటిని పొగిడేదిగా వుంటుంది. అయితే వీరిలో పొరపాట్లు వుండవాఅంటారు. వుంటాయి. దీనికికారణం కార్మికవర్గంలో కూడా పెటీ బూర్జువా స్వభావం కలిగిన వ్యక్తులు చాలమంది వున్నారు. వీరు, కొందరు రైతులూ ఇంకా వెనకబడి వుంటారు. తమ ఆలోచనలలో పెట్టీ బూర్జువా ధోరణులను కలిగి వుంటారు. మన పోరాటం మీదవున్న భారాలలో ఇదికూడా ఒకటి. దీనిని మనం తొలగించుకోవాలి. క్రమక్రమంగా వారిని విజ్ఞానవంతులను చేయాలి. వారంతట వారు త్వరత్వరగా అభివృద్ధిచెందడానికి వారిపైనున్న ఈ భారాన్ని తొలగించుకోడంలో వారికి మనం సంపూర్ణంగా తోడ్పడాలి. ఇప్పటికే మన పోరాటాలు వారిలో మార్పును తీసుకువస్తున్నాయి. వారు తమ భావాలను మెల్లగా మార్చుకోడానికి మొదలు పెట్టారు. మన రచయితలూ, కళాకారులూ ఈ మార్పును తమ తమ రచనల్లోను ప్రదర్శనాలలోను చిత్రించాలి. అంతేకాని వాటికి దూరంగా ప్రేక్షకులలాగ కూర్చొని చూస్తూ

వారి పొరపాట్లను పట్టుకుని ఎగతాళిచేస్తూ వుండకూడదు. ప్రజలలో వచ్చే అభివృద్ధిని చక్కగా వర్ణించడంద్వారా ప్రజాసామాన్యంలో ఐక్యతను నిర్మించడానికి తోడ్పడాలి. అటువంటి వర్ణనలు ప్రజలనింకా ముందడుగు వేయించుతాయి. విప్లవపోరాటంలోకి ఎక్కువమందిని తీసుకువస్తాయి. వారిలోవుండే అజ్ఞానాన్ని తొలగిస్తాయి. ప్రజలలో అణగివుండే విప్లవ శక్తిని రేకెత్తించుతాయి.

## మన ప్రేక్షకులెవరు ?

దీనిలో, మనం సృష్టించే సారస్వతం, కళారూపాలు ఎవరికోసం అనే ప్రశ్న ఇమిడివుంది. ఈసమస్య, వేరు వేరు ప్రదేశాలలో వేరు వేరు విధాలుగా వుంటుంది. షాన్-కాన్-నింగ్ సరిహద్దుప్రాంతంలోను, మన ప్రజాస్వామ్య ప్రదేశాల్లోను, మధ్యచైనాలోను ఒక విధంగా వుంటుంది. కొమింటాంగ్ ప్రాంతంలోను, యుద్ధానికి పూర్వపు షాంఘైలోను మరో విధంగా వుంటుంది. షాంఘైలో యుద్ధానికి పూర్వకాలంలో సారస్వతం చదివేవారు ఎక్కువగా విద్యార్థులు, ఉద్యోగులు, యజమానులుగాను వుండేవారు. యుద్ధం ఆరంభమైనప్పటినుంచీ కొమింటాంగ్ ప్రాంతంలో పత్రికలు, పుస్తకాలు చదివేవారి సంఖ్య పెరిగింది. సంఖ్య పెరిగినా చదివేవారుమాత్రం ఇంకా, పైన చెప్పిన తరగతులవారుగానే వుండిపోయారు. ఈ పరిస్థితి ఎందుకు సంభవించిందంటే. కొమింటాంగు ప్రభుత్వం కార్మికుల్ని, రైతుల్ని, సైనికుల్ని విప్లవకరసారస్వతంనుంచి. కళలనుంచీ దూరంగా వుంచింది.

మన ప్రాంతాలలోని పరిస్థితులు పైవాటికి పూర్తిగా వ్యతిరేకం. మన ప్రాంతంలో మన పార్టీసభ్యులు ప్రభుత్వ ఉద్యోగులతోపాటే. కార్మికులు, కర్షకులు, సైనికులు అందరూ సమంగా మన విప్లవ సారస్వతాన్ని, కళారూపాలను చదివి, చూచి ఆనందించుతారు. మన ప్రాంతాలలోకూడా విద్యార్థులున్నారు. కాని వారు పాతరకం కాదు. వారిలో కొందరు ఇదివరకే మన పార్టీలోకి వచ్చినవారైనా అయివున్నారు. లేదా ముందు ముందు పార్టీలోకి వచ్చేవారుగానైనా వున్నారు. అన్నిరకాల పార్టీ అభిమానులూ, సైన్యంలో వుండే అందరు సైనికులూ, కర్మాగారాల్లో పనిచేసే కార్మికులు, గ్రామాల్లోని రైతులు ఒకరేమిటి మన

ప్రాంతంలో వుండేవారందరూ మన సారస్వతాన్ని, పత్రికలను చదవాలని ఉవ్విళ్ళూరుతూవుంటారు. చదవలేనివారు మన నాటకాలను, సినిమాలను ఇతర కళారూపాలను చూడాలని, తాముకూడా అలా పాడాలని కోరుతూవుంటారు. అలాంటి ప్రజలకోసమే మన సారస్వతాన్ని కళలను సృష్టిస్తాం.

పార్టీ అభిమానులంటే జనాభాలో ఏదో కొద్దిభాగం మాత్రమే వుంటారని అనుకోవద్దు. కొమింటాంగ్ ప్రాంతంలో ప్రచురింపబడే ఏ పుస్తకంకంటె కూడా మన ప్రాంతంలో మన పుస్తకాలు చదివే వారి సంఖ్య ఎప్పుడూ ఎక్కువగానే వుంటుంది. ఉదాహరణ కావాలంటే కొమింటాంగ్‌లో ప్రకటింపబడే పుస్తకం ఏదీ 2 వేల కాపీలకు మించదు. ఒక్కొక్క పుస్తకం మూడు ముద్రణలు జరిగిందని అనుకున్నా మొత్తం 6 వేల కాపీలకంటె ఎక్కువకాదు. ఇక మన ప్రాంతంలో పరిస్థితి చూద్దాం. ఒక్క యెనాన్‌లోనే ఏపుస్తకం అచ్చువేసినా 10 వేల కాపీలకు తక్కువపడదు. అదీగాక, మన పార్టీలోని వారంతా విప్లవ కార్య కలాపాల్లో అనుభవం వున్నవారూ, అష్టకష్టాలుపడి కాకలుతీరిన వారూను. వారు మనదేశం అన్ని ప్రాంతాలనుంచీ ఇక్కడికి వస్తూ వుంటారు. తిరిగి తమతమ ప్రాంతాలకు పోతూ వుంటారు. అందుచేత వీరి విజ్ఞానాన్ని పెంపొందింప జేయడమనేది చాలా ముఖ్యమైన కర్తవ్యం. ఆకర్తవ్యాన్ని మన వైజ్ఞానికరంగంలో పనిచేసే పర్కార్లు ఎంతోచక్కగా నెరవేర్చవలసి వుంది.

మనం సృష్టించే కళలు కార్మికులకోసం, కర్షకులకోసం, సైనికుల కోసం మన అభిమానులకోసం కనుక, వారిని అర్థంచేసుకోడం, విషయాలను వారికి ఎలా చెప్పాలి అనే సమస్య ఎదుర్కొంటుంది. దీనిని పరిష్కరించడానికి, గ్రామాలలోను, ఫ్యాక్టరీలలోను, 8 వ, 4 వ కమ్యూనిస్టు సైన్యాలలోను మన పార్టీసభ్యులూ, ప్రభుత్వశాఖలు ఎంతో పని చేయవలసివుంది. దీనివల్ల అన్నిరకాల ప్రజలను అర్థంచేసుకోగల్గుతాం.

ఈ సందర్భంలో మన రచయితల్ని కళాకారుల్ని ఒక ప్రశ్న అడుగుతాను. పై కర్తవ్యాన్ని నెరవేర్చడానికి ఇంతవరకు మీరు చేసిన దేమిటి? ఈ ప్రజలతోను, ప్రేక్షకులతోను మీకు పరిచయంలేదని

నేనంటాను. మీరు వారిని అర్థంచేసుకోడంలేదు. మీరు రణరంగంలేని వీరులు. మీరు సృష్టించే పాత్రలతోగాని, మీరు చిత్రించే పరిస్థితులు సన్నివేశాలతోగాని, కనీసం ఇవన్నీ మీరు ఎవరికోసమైతే తయారు చేస్తున్నారో ఆ ప్రజలతోగాని మీకు ఏమీ పరిచయంలేదు.

మొట్టమొదట మీరు ప్రజలభాషను అర్థం చేసుకోవాలి. మీరు మీ రచనలలో ఎంతసేపూ విద్యావంతుల హెచ్చుస్థాయి భాషను వాడుతారు. ప్రజ ఉపయోగించే సామాన్యభాషకీ మీరు రాసేదానికీ ఎక్కడా లంగరు అందదు.

మన కామ్రేడ్సు చాలామంది కళలను ఎక్కువ ప్రచారం చేయాలి అని అంటూ వుండడం నేను విన్నాను. అయితే ఈ ప్రచారం చేయడమంటే ఏమిటి? దీని అర్థం, ఆయా కళారూపాలను ప్రదర్శించేవారి భావాలు, ఉద్దేశాలు వాటిని చూచే కార్మిక కర్షకులయొక్క, సైనికుల యొక్క, ప్రజాసామాన్యంయొక్క భావాలతోను, ఉద్దేశాలతోను సమ్మిళితం కావాలి. ఈ ఐక్యతను సాధించడంకోసం, ముందు మనం, ప్రజల భాషను అర్థం చేసుకోవడానికి పూనుకోవాలి. ప్రజల భాష ఏమిటో మనకి తెలియకుండా మనం వారితో సారస్వతాన్ని గురించీ కళలను గురించీ మాట్లాడేదేమిటి?

మిమ్మల్ని "రణరంగం లేని వీరులు" అని అంటున్నానంటే దాని ఉద్దేశం ఇది. మీ సిద్ధాంతాలను ప్రజాసామాన్యం అర్థంచేసుకోలేదు. పెద్ద రచయితలమనీ, పెద్ద కళాకారులమనీ మీ గొప్పతనాన్ని నిరూపించుకొని వీరుల్లాగా చలామణీ అవుదామని మీ సారస్వతాన్ని, కళలను మీ భావాలను ఎంత ఎక్కువగా ప్రజలలో అమ్ముకోడానికి ప్రయత్నిస్తారో, అంత యెక్కువగాను ప్రజలు వాటిని నిరాకరిస్తారు. మిమ్మల్ని ప్రజలర్థం చేసుకోవాలంటే, మీరు ప్రజలలో ఒక భాగంగా కలిసిపోవాలంటే మీ రా పద్ధతుల్ని మార్చుకోవాలి. మూసలో కరిగే లోహంలాగా ఎంతో కష్టతరమైన, సుదీర్ఘమైన పద్ధతిలో మార్పుచెంది నిగ్గు తేలడానికి మీరు తయారుకావాలి. మీ రా నిశ్చయానికి రావాలి.

ఈ సందర్భంలో నా అనుభవాన్ని ఒకదాన్ని మీకు చూపుతాను. ప్రజలపట్ల మీ భావాల్ని మార్చుకోవడమంటే ఏమిటో మీకు తెలుస్తుంది.

నేను చదువుకునే రోజుల్లో విద్యార్థులకుండే అలవాట్లే కొన్ని నాకూ అబ్బాయి. శరీరకష్టం చేయడమంటే నాకు అసహ్యంగా వుండేది. నా సామాను నేను భుజంమీద పెట్టుకొని మోసుకెళ్ళడమంటే నాకెంతో సిగ్గుగా వుండేది.

అందులోనూ తోటి విద్యార్థులముందు ఆ పని చేయడమంటే తలకొట్టేసినట్లనిపించేది. ఆరోజుల్లో విద్యావంతులైనవారే ప్రపంచంలో అందరిలోకి పరిశుభ్రమైనవారని నేను అనుకునేవాడిని. రైతులు, కూలీలు, సైనికులు వీరంతా వట్టి మడ్డిమనుషులని ఏహ్యభావంతో వుండేవాణ్ని. నా కెప్పుడైనా బట్టలు లేకపోతే ఈ చదువుకునేవాళ్ళదగ్గరే ఎరువుతెచ్చుకునేవాడిని గాని రైతుకూలీలవద్దా, సైనికులవద్దా ఎప్పుడూ తెచ్చుకునే వాడిని కాను. అప్పుడు నా దృష్టిలో చదువుకున్నవారి బట్టలే చాలా పరిశుభ్రమైనవిగాను మిగతావారివన్నీ మురికిగుడ్డలుగాను కనిపించేవి.

విప్లవానంతరం రైతులతోనూ, కూలీలతోనూ, సైనికులతోనూ, కలిసి జీవించాను. క్రమంగా వారిని అర్థం చేసుకోగలిగాను. వారుకూడా నేను బూర్జువాబడులలో నేర్చుకొన్న బూర్జువా, పెటీబూర్జువా లక్షణాలను నాలోనుంచి క్రమంగా తొలగించారు. ఈ అనుభవం అయిన తరువాత ఈ చదువుకున్న విద్యావంతుల్ని. కార్మికులతోను, కర్షకులతోనూ, సైనికులతోను పోల్చిచూస్తే. నాకు చదువుకున్న వాళ్ళల్లోనే ఎక్కువ మురికితనం కనిపించింది. వారి తలకాయల్లోనే, కాదు వారి ఒంటిమీద కూడా చాలా మురికివుంది. ప్రపంచంలోకల్లా పరిశుభ్రమైన మానవులెవరంటే కార్మిక కర్షకులేనని చెబుతాను. వారి చేతులు మురికిగావుంటే వుండవచ్చు. వారి కాళ్ళనిండా పేడవుంటే వుండవచ్చు అయినప్పటికీ బూర్జువావర్గంకంటేను, పెటీ బూర్జువావర్గంకంటేను వారే పరిశుభ్రమైన వారు. భావాలను మార్చుకోవడమంటే నా వుద్దేశమిదే, ఒక వర్గంనుంచి యింకోవర్గంలోకి మార్పుచెందడమే.

మన వైజ్ఞానికరంగంలో పనిచేసేవర్కర్లు ఈ మేధావులవర్గంలో నుండి వచ్చినవారెవరైనా వుంటే వారు పైన చెప్పిన విధంగా తమ భావాలను, ఆలోచనలను మార్చుకోవాలి. ప్రజాసామాన్యం వారి రచనల్ని, ప్రదర్శనల్ని ఆహ్వానించటానికిముందు వారిలో ఈ పరివర్తన రావాలి.

ఈ మార్పు రానిదే ఈ రచయితలు, కళాకారులు, ఎంత తల్లక్రిందులైనా వారి భావాలు ప్రజల్లోకి చొచ్చుకొనిపోలేవు.

## మన విజ్ఞానాన్ని పెంపొందించుకోవడం ఎలాగ?

దీనిలో నావుద్దేశం మార్క్సిజం — లెనినిజం నేర్చుకోవడం. ఆవిజ్ఞానంతో సమాజాన్ని గురించి పరిశోధనలు సాగించడం. విప్లవ రచయితలు కావాలనేవారు, ముఖ్యంగా కమ్యూనిస్టుపార్టీ రచయితలు కావాలనేవారు మార్క్స్ — లెనిన్ సిద్ధాంతాలను వంటబట్టించుకోవాలి. కాని నేడు మన కామ్రేడ్సు చాలామందికి మార్క్సిజం — లెనినిజం యొక్క ప్రధానసూత్రాలే తెలియవు. ఉదాహరణకి మార్క్సిస్టు — లెనినిస్టు దృక్పథంలో బాహ్య పరిస్థితులే మన భావాలను నిర్ణయిస్తాయి. అందుచేత మనవర్గ పోరాటంయొక్క, జాతీయ పోరాటంయొక్క స్థితిగతులే మన భావాల్ని నిర్ణయిస్తాయి. కాని మన కామ్రేడ్సు చాలామంది ఈసూత్రాన్ని తల్లక్రిందులు చేస్తారు. ప్రతిసంఘటనకీ వెనుక వుండి ప్రోత్సాహమిచ్చే శక్తి ప్రేమయేనని వారంటారు. ఈవర్గసమాజంలో ప్రేమంటే ఏదో ఒక వర్గాన్ని ప్రేమించటంతప్ప మరొకటికాదు. కాని చాలామంది కామ్రేడ్సు అభిప్రాయం ప్రేమకి వర్గ విభేదాలు లేవూ అని. అంటే వారి వుద్దేశంలో ఈప్రేమ అన్నిటికీ అతీతమైనదని. ఇలాగే వారిభాషలో యింకాకొన్ని సర్వాతీతములైనవని వాడబడే పదాలున్నాయి. అవి సర్వాతీతమైన ప్రేమ, సర్వాతీతమైన స్వాతంత్ర్యం, సర్వాతీతమైన సత్యం, సర్వాతీతమైన మానవస్వభావం అనేవి. దీనినిబట్టి చూస్తే బూర్జువా సిద్ధాంతాల ప్రభావం మన కామ్రేడ్సుమీద ఎంతఎక్కువగా వుందో బోధపడుతుంది.

ఇప్పుడు మనం మన బుర్రలలోనుంచి ఈ బూర్జువా భావాల్ని పూర్తిగా తొలగించుకోవాలి. మార్క్సిజం—లెనినిజం అవగాహన చేసుకోవాలి.

కల్చరల్ రంగంలో పనిచేసే వారంతా కొత్తకొత్త రూపాలనూ కొత్తకొత్త రచనలనూ సృష్టించేవిధానాలనుగూర్చి ఎక్కువ కృషి చేయాలని అనేమాట నిజమే. కాని మార్క్సిజం—లెనినిజం విప్లవ వాదులందరూ నేర్చుకోవలసిన విషయం. అలాంటప్పుడు పారవ్వతరంగం

లోనూ-వైజ్ఞానిక రంగంలోను పనిచేసే వారంతా దానిని అధ్యయనం చేయవలసిన వారే అవుతారు. దీనికితోడు రచయితలు, కళాకారులయిన మీరంతా సమాజాన్ని గురించి బాగా పరిశోధనలు చేయాలి అంటే సమాజంలోవున్న వర్గాలేమిటి? వాటి పరస్పర సంబంధాలేమిటి? ప్రతి వర్గంలోను వున్న వ్యక్తుల స్థితిగతులేమిటి? వారి ఆలోచనలేమిటి? అనే విషయాలన్నీ పరిశీలించాలి. ఈ విషయాలను అర్థంచేసుకోవడం ద్వారానే మన సారస్వతం - కళలు ఒక నిజమైన స్వరూపాన్ని పొందుతాయి. ఒక సరియైన దృక్పథాన్నిస్తాయి.

## వైజ్ఞానిక రంగంలో అనుసరించవలసిన కార్యక్రమం

మనం ఏదైనా విషయాన్ని తీసుకునేటప్పుడు దాని యదార్థ పరిస్థితి ఏమిటో అక్కడనుంచి ప్రారంభించాలిగాని, దానిని గూర్చిన నిర్వచనాన్నుంచికాదు. అందుచేత సారస్వతాన్ని కళలను తీసుకుని, అవి నేటి మన వైజ్ఞానికరంగంలో ఏ కార్యక్రమాన్ని, అనుసరించాలో నిర్ణయించడానికి, పుస్తకాలలో వుండే నిర్వచనాలను కొలతబద్దగా తీసుకుంటే అది తప్పుమార్గం. మనం మార్క్సిస్టులం. మనలాంటివారందరికీ మార్క్స్ ఏనాడో ఈ విషయమై హెచ్చరిక చేశాడు. నిర్వచనాలపై ఆధారపడి కాకుండా, వున్న పరిస్థితిపైనే ఆధారపడి సమస్యల్ని పరిష్కరించడానికి పూనుకోవాలని చెప్పాడు. సరియైన పాలసీని, కార్యక్రమాన్ని నిర్ణయించడానికి అది ఒక్కటే మార్గం. ఇప్పుడు వైజ్ఞానిక రంగంలోకూడా మనం అదే దృక్పథంతో బయలుదేరాలి.

అయితే నేటి పరిస్థితి ఏమిటి? మన దేశం జపానుకు వ్యతిరేకముగా 5 ఏళ్ళనుంచి పోరాడుతోంది. ప్రపంచ ఫాసిస్టు వ్యతిరేకశక్తులు పురోగమిస్తున్నాయి. మన దేశంలోని పెద్దపెద్ద జమిందార్లు, బూర్జువా వర్గం ఈ ఫాసిస్టువ్యతిరేకపోరాటంలో అంటీముట్టనట్టుగా వుంటున్నారు. అంతరంగికవ్యవహారాలలో చూద్దామా అంటే ప్రజలమీద నిరంకుశ విధానాన్ని అవలంబిస్తున్నారు. మరోప్రక్క 1919 మే 4 వ తేదీనుంచి నిర్మింపబడిన విప్లవకర వైజ్ఞానికోద్యమం ఒక కొత్త సాంప్రదాయాన్ని నెలకొల్పింది. (కొన్ని లోట్లు. పొరపాట్లు వున్నప్పటికి ఈ 23 ఏళ్ళలోను కల్చరల్ ఉద్యమం మన విప్లవోద్యమానికి ఎంతో తోడ్పడింది.) 8 వ,

4 వ కమ్యూనిస్టుసైన్యాలు చాలాచోట్ల ప్రజాస్వామిక కేంద్రాలను ఏర్పరి చాయి. ఎంతోమంది కల్చరల్ వర్కర్లు ఆ ప్రదేశాలకు వెళ్ళి పనిచేస్తు న్నారు. మనప్రాంతాలలో పనిచేసే వైజ్ఞానిక దళాలకి, కొమింటాంగ్ ప్రాంతంలో పనిచేసే దళాలకిచాలాతేడావుంది. మనప్రాంతాలలో వుండే వైజ్ఞానిక వర్కర్లు మొదటినుంచి ఈ సమస్యల్ని గురించి పరిశీలించు తూనే పనిచేస్తున్నారు. నేటి చైనా పరిస్థితు లివి.

కల్చరల్ రంగంలోని ఈ పరిస్థితిని ఆధారంగా తీసుకొని మన సమస్యలను గురించి ఆలోచించాలి. అప్పుడుకూడా ఈ సమస్యలన్నిటి లోనూ ప్రధానమైనది కీలకమయినదీ ఏమిటో మనం నిర్ణయించుకోవాలి. నా అభిప్రాయంలో అలాంటి సమస్య ముఖ్యంగా ప్రజాసామాన్యానికి ఉపకరించేదిగా ఉండాలి. ప్రజలకోసం ఎలా పని చేయాలో తెలుసుకునే దిగా వుండాలి. ఈ సమస్య కనక పరిష్కరింపబడక పోయినా, లేదా అసంపూర్ణంగా పరిష్కరింపబడినా వైజ్ఞానిక రంగంలో పనిచేసే మన వర్కర్లకు వారి నెదుర్కొనే పరిస్థితులతోను, వారి కార్యకలాపాల్లోను ఒక పొందిక వుండకుండా పోతుంది. వారికి ఆంతరంగికంగాను, బైటి ప్రపంచంలోనుకూడా అనేక స్పర్థలు బయలుదేరుతాయి.

## కళలు, సారస్వతం ఎవరికోసం ?

మనలనెదుర్కొనే మొట్టమొదటి సమస్య, మనం సృష్టించే సార స్వతం, కళలు, ఎవరికోసం? అనేది.

మన క్రిందవున్న ప్రజాస్వామిక ప్రాంతంలో మన వైజ్ఞానిక దళాలు ఈ సమస్యను పరిష్కరించేసినట్లుగా కనబడవచ్చు. కాని నిజా నికి ఇంకా అది జరగలేదు.

దీని విషయమై మన కామ్రేడ్స్‌లోనే చాలామంది ఒక స్పష్ట మైన మార్గం ఏమిటో తెలుసుకోలేదు. అందుచేతనే మనవాళ్ళు తమ తమ రచనలలోను, కళారూపాలలోను, ప్రదర్శించే భావాలలోను, రసాల లోను కొన్ని ప్రజావసరాలకు భిన్నంగా వుంటున్నాయి. వారి దృక్పధా లలో కూడా ఇంకా ఈ లోపం వుంది.

ఇంకొక విషయంకూడా వుంది. ఈ విముక్తి పోరాటంలో మన కమ్యూనిస్టుపార్టీతోను, సైన్యాలతోను, కల్చరల్ వర్కర్లతోను కలిసి

పనిచేయడానికి వచ్చిన విద్యావంతుల్లో కొందరు జపాను గూఢచారులు, కొమింటాంగు గూఢచారులు కూడా ఉన్నారు. వీరిని తప్పిస్తే మిగతా వారందరూ ఒకే ఆశయంకోసం పనిచేస్తున్నవారే.

ఈ కామ్రేడ్స్ చేస్తున్న కృషిఫలితంగానే మన సారస్వతం, నాటకం, సంగీతం మొదలైనవన్నీ ముందడుగు వేశాయి. విజ్ఞానిక రంగంలో పనిచేసే వర్కర్లంతా చాలమంది యుద్ధం ప్రారంభమైన తరువాతనే కార్యాచరణకు పూనుకున్నారు. యుద్ధానికి పూర్వంనుంచీ విప్లవోద్యమంలో పనిచేస్తున్నవారు కూడా లేకపోలేదు. అయినప్పటికీ మొత్తంమీద అందరూ కలిసి ఈ రంగంలో పనిచేయడంలో ఎన్నో కష్టనష్టాలను ఎదుర్కొని నిలబడ్డారు. వారు రచించిన రచనలు, తయారు చేసిన కళారూపాలు, ప్రజలమీద ఎంతో ప్రభావం కలిగివున్నాయి.

అయితే అలాంటి విజయాన్ని సాధించిన కామ్రేడ్సుకుకూడా ఒక స్పష్టమైన మార్గం తెలియదని ఎందుకంటున్నారు? అని సందేహం రావచ్చు. ఆ రంగంలో పనిచేసే ఎవరైనా విప్లవ సారస్వతం ప్రజల కోసం కాకుండా, వారిని పీడించుకుతినే దోపిడీదార్లకోసం వ్రాస్తారా? అని అడగవచ్చు.

చైనాలో అలాంటి దోచుకునేవారి విజ్ఞానం కొంతవుంది. జమీందార్లకు ఉపయోగపడే విజ్ఞానం కొంతభాగం ఫ్యూడల్ విజ్ఞానమైవుంది. దీనికి ఇంకా కొంత పలుకుబడివుంది. బూర్జువా వర్గాని కుపయోగపడే విజ్ఞానంకూడా చైనాలో వుంది. అది బూర్జువా విజ్ఞానం. ఉదాహరణకు లియాంగ్‌షి - చూ లాంటి రచయితలను మనం తీసుకోవచ్చు. వారి సిద్ధాంతం, కళలు వర్గవిభేదాలకు అతీతములైనవని, యదార్థానికి వీరు కార్మికవర్గ విజ్ఞానానికి వ్యతిరేకంగా బూర్జువా విజ్ఞానాన్ని సమర్థిస్తారు. తరువాత సామ్రాజ్యవాదులను బలపర్చే కళా విజ్ఞానంకూడా చైనాలో వుంది. చౌసో-జాన్, చాంగ్‌సీ-పింగ్ లాంటి బానిసవిధానాన్ని బలపర్చే వారుకూడా లేకపోలేదు. ఇంకో రకమైన విజ్ఞానంకూడా వుంది. పైకి మట్టుకు అది చాలా విప్లవాత్మకమైన విజ్ఞానంలాగ కనిపిస్తుంది, విజ్ఞాని కది పై మూడింటిలోకే వస్తుంది.

ఇక మనవిజ్ఞానం విషయం తీసుకొందాము. మనం వెదజల్లే విజ్ఞానం పైజెప్పిన ఏదో పిడిగ్రూపుకోసం కాకుండా, సామాన్యప్రజలకోసం ఏర్పడింది. మనది కార్మికవర్గనాయకత్వాన, సామ్రాజ్యవాదానికి, ఫ్యూడల్ విధానానికి, వ్యతిరేకంగా పోరాడే ప్రజావిజ్ఞానం. మనం సృష్టించే సారస్వతం, కళలు, ఈ నూతనవిజ్ఞానంలో భాగాలుగానే వుంటాయి. గాని వేరుగావుండవు. అలా అవి బూర్జువా కళారూపాలుగాని, ఫ్యూడల్ కళారూపాలుగాని మనం త్రోసిపుచ్చం. కాని ఒకసారి ఆ కళారూపాలు మన చేతిలోకి వచ్చాయంటే అవి ఒక కొత్తజన్మ లెత్తుతాయి. కొత్త సందేశంతో వస్తాయి. విప్లవకరమైనవిగా తయారవుతాయి. ప్రజలకు ఉపయోగపడుతాయి.

ప్రజాసామాన్యమంటే ఎవరు?

ప్రజాసామాన్యంలో నూటికి తొంభయిమంది కార్మికులు, కర్షకులు, సైనికులు, మధ్యతరగతివారు అయివుంటారు. దీనిలో విప్లవాన్ని నడిపే వర్గం కార్మికులు. తరువాత కర్షకులు వస్తారు. విప్లవంలో వీరు కార్మికులకు బలమైన మిత్రులుగా నిలబడిపోరాడుతారు. మూడవది మన 8 వ, 4 వ కమ్యూనిస్టుసైన్యాలు. దీనిలో వుండేవారంతా సాయుధులైన కార్మిక-కర్షకులే. వీరు విప్లవపోరాటంలో ఒక ప్రధానాంగం. నాలుగవది, మనతో కలసి పోరాడే ఇతర సైనికదళాలు. వీరు మనతో దీర్ఘకాల ఒడంబడికలమీద కలసి పోరాడుతారు. ఈ నాలుగురకాలు కలిస్తే చైనా ప్రజాసామాన్యంలో అధికసంఖ్యాకు లవుతారు. అందుచేత మన సారస్వతం, కళలు ముఖ్యంగా కార్మికవర్గానికి ఉపకరించేవిగా ఉండాలి.

భూస్వామ్య వర్గానికీ, బూర్జువా వర్గానికి చెందిన వారైనా, జపాన్‌ను ప్రతిఘటించి పోరాడేవారితో కూడా మనం సహకరించాలి. కాని ఒకవిషయం మాత్రం మరచి పోకూడదు. వారు జపాన్‌ను ఎదిరించి పోరాడుతున్నా, చైనా ప్రజాసామాన్యాని కంతటికోసం మనం నిర్మించే విశాల ప్రజాస్వామ్యాన్ని వ్యతిరేకిస్తారు. వారి విజ్ఞానం వారికి వేరేవుంది. మనం చేసే చికిత్స వారికికాదు. వారు దానిని తిరస్కరిస్తారు.

మన సారసత్వం, కళలూ పైన చెప్పిన నాలుగురకాల ప్రజల కోసమే. వారిలో మొదటి మూడురకాల ప్రజలకే మనం ప్రాధాన్యత

వివ్వాలి. పెటీ బూర్జువా వర్గానికి వైజ్ఞానిక స్థాయి కొంచెం ఎక్కువగానే వున్నా, విప్లవకరమైన పట్టుదలలోను, కార్యదక్షతలోను, సంఖ్యలోనూ కూడా వారు బలహీనమైన గ్రూపే. అందుచేత మన ప్రేక్షకులలో ఎప్పుడూ కూడా కార్మిక కర్షకులను, సైనికులను వెనుకకునెట్టి ఈ పెటీ బూర్జువా వర్గానికి ప్రాధాన్యత విచ్చకూడదు.

మన ప్రేక్షకుల విషయమై చాలమంది కామ్రేడ్స్‌కే ఒక స్పష్టమైన అభిప్రాయం లేదని నే ననడానికి ఈ ముఖ్యవిషయాన్నే దృష్టిలో పెట్టుకున్నాను. కేవలం సిద్ధాంతాలను మాత్రమే దృష్టిలో పెట్టుకొని మాట్లాడడంలేదు. సిద్ధాంతాలమాట కొస్తే మనలో ఎవరూకూడా, మాట వరసకైనాసరే, కార్మిక కర్షకులకంటెనూ, సైనికులకంటెనూ పెటీబూర్జువాయే ప్రధానమైనదని అనలేరు. కాని ఆచరణలోమట్టుకు మనకామ్రేడ్సు కొందరు పెటీబూర్జువాయే తమ ప్రేక్షకులలో ముఖ్యులని భావించేవారున్నారు.

చాలమంది కామ్రేడ్స్, మేధావంతు లనబడేవారిమీదనే ఎక్కువ శ్రద్ధచూపుతున్నారు. వారి ఆలోచనలు ఎలావుంటాయోనని పరిశోధనలు చేస్తున్నారు. వారిని తెగ వర్ణింపుతున్నారు. చివరకు వారి దుర్గుణాలను, బలహీనతలను క్షమించడమేగాక సమర్థించే స్థితికికూడా పోతున్నారు. పోనీ, ఈ పని మధ్యతరగతినుంచి వచ్చిన ఆ మేధావంతులను సరియైన మార్గంలో పెట్టి నడపడానికిగాని, పోరాటంలో వారువచ్చి పాల్గొని కార్మిక కర్షకులకు, సైనికులకూ సహాయం చేయడానికిగాని చేస్తున్నారా అంటే, అదీకాదు.. అయితే వారాపని ఎందుకు చేస్తున్నారంటే, ఆ కామ్రేడ్స్‌కూడా పెటీబూర్జువా విద్యావంతుల తరగతికి చెందినవారే అయివున్నారు. మేధావులతో కలసిమెలసి వుండడమనేది వారికి ఆనంద దాయకమైన సంగతి. మేధావులను గురించి మన కామ్రేడ్స్ చేసే ఈ పరిశోధనలు, వర్ణనలు కార్మికవర్గ దృక్పథంనుంచి చేసినా, కొంత ఉపయోగకరంగా వుండును. లేనినాడది పెటీబూర్జువావర్గం తన డబ్బా వాయించుకోడం తప్ప మరోటికాదు.

అలాంటి కామ్రేడ్సు సంగతిచూస్తే వారికి కార్మిక కర్షకులతోను, సైనికులతోను చాల తక్కువ సంబంధాలుంటాయి. వారిలో ఈకామ్రేడ్సుకి

మిత్రులెవరూ వుండరు. ఈ కామ్రేడ్సు సామాన్య ప్రజల మనస్తత్వాలను ఇదమిద్ధమని నిర్ణయించుకోలేని స్థితిలో వుంటారు. ఒక్కమాటలో చెప్పాలంటే- ఈ కామ్రేడ్స్ వేసుకున్న ముసుగు కార్మిక కర్షకులదే అయినా, ముఖాలు మాత్రం పెటీబూర్జువా ముఖాలే.

కొన్ని సందర్భాలలో మట్టుకు ఆ కామ్రేడ్స్ కార్మిక కర్షకులపట్ల, సైనికులపట్ల ప్రేమ చూపవచ్చు. కాని మరికొన్ని సందర్భాలలో వారిని అసహ్యించుకుంటారు. వారిభావాలు, వారి అభినయం, చేష్టలు ప్రాథమిక దశలో వున్న వారి సారస్వతరీతులు, కళారూపాలు ఈ కామ్రేడ్స్ కి నచ్చవు. అంటే వారి గోడవార్తా పత్రికలు, గోడమీద బొమ్మలు గేయదం, జానపదాలు, కథలు వగైరా ఈ మేధావులకు నచ్చవు. ఒక్కొక్కప్పుడు వీరు ఆ కళారూపాలపట్ల ఆసక్తి చూపవచ్చు. ఈ ఆసక్తి ఎక్కడినుంచి వస్తుందో కూడా మనం సులభంగానే తెలుసుకో వచ్చు. తాను సృష్టించిన రచనలకు మెరుగులు పెట్టుకోవాలనిగాని, ప్రజలెంత వెనకబడివున్నారో చూద్దామనే సరదాతోగాని. ఈఆసక్తి వారిలో కలుగుతుంది. ఇతర సమయాల్లో వీరు ప్రజల ఈ తత్వాలను బహిరంగంగానే తోసిపుచ్చుతారు. పెటీబూర్జువా-బూర్జువా మేధావులను అభినందించుతారు. ఇంకా స్పష్టంగా చెప్పాలంటే - వీరు కార్మికవర్గంతో వున్నా, వీరి ఆత్మలుమాత్రం పెటీబూర్జువా సామాన్యానికి అంకితమై వున్నాయి.

అందుచేత మన ప్రేక్షకులెవరు అనే సమస్యకు స్పష్టమైన పరిష్కార మార్గముటుంటే, ఈకామ్రేడ్స్‌కి అసలు దానికి పరిష్కార మార్గమే కనబడదు. నేనీ మాటలు అంటున్నానంటే, అవి ఈ మధ్యనే యెనాన్‌కు వచ్చినవారిని గురించి మాత్రమే కాదు. చాల సంవత్సరాల నుంచి మన సైనిక కేంద్రాలలో పనిచేసే వారికి కూడా వర్తిస్తాయి.

ఈలోపాన్ని సరిదిద్దుకోడానికి మనకి చాలాకాలం పడుతుంది దాదాపు పదేళ్ళయినా పట్టవచ్చు. ఎంతకాలం పట్టినా, ఒకటి మాత్రం మనం చూసుకోవాలి. ఆ లోపాలను సరిచేసుకు తీరాలి. అదిన్నీ అసంపూర్ణంగా కాకుండా పూర్తిగా పరిష్కరించాలి. ఇది మన రచయితలు, కళాకారుల కర్తవ్యం. వారు తమదృష్టులను ఇటు మరలించాలి. కార్మిక

కర్షకుల్లోను, సైనికులలోను వారు తోఘగా చొరబడాలి. వారి పోరాటాలలో పాల్గొనాలి. మార్క్సిజాన్ని, లెనినిజాన్ని బాగా అవగాహనం చేసుకుంటూ, సమాజాన్ని గురించి పరిశోధనలుచేస్తూ, వారు ప్రజాసామాన్యం వైపుకు రావాలి. కార్మిక కర్షకులయొక్క, సైనికులయొక్క నిజమైన సారస్వతాన్ని, కళలను స్థిరంగా వుండేటట్లు నెలకొల్పాలంటే ఇదొక్కటే మార్గం.

మన ప్రేక్షకులెవరు? అనేది ఒక ప్రధానమైన సమస్య. సిద్ధాంత సంబంధమైన సమస్య ఇంతకాలంనుంచీ మనవాళ్ళు జరిపే చర్చలూ, తెచ్చే వాదనలూ. గందరగోళంగాను, అనైక్యతతో కూడినవిగానూ వుంటూ వచ్చినందువల్ల. మన కామ్రేడ్స్ ఈ ప్రధాన సమస్యకు పరిష్కారమార్గం కనుక్కోలేక దానిని విడిచిపెట్టి ఇతర అప్రధాన విషయాలను పట్టుకుని వేలాడుతున్నారు. ఈ ముఖ్యసూత్రంమీద మన వారెవరికీ అభిప్రాయభేదాలుండవు, ఎందుకంటే దీనిపై చర్చలు జరిపే రెండుపక్షాలూ ప్రజాసామాన్యంనుంచి కొంతవరకు దూరమైవున్నవారే. ఉభయులూ కార్మిక కర్షకుల్నీ సైనికుల్నీ అసహ్యించుకునేవారే. ఇక్కడ "కొంతవరకు" అనేమాట ఎందుకు వాడుతున్నానంటే, కొమింటాంగు ప్రాంతంలోని వారితో పోల్చిచూస్తే మనవారు చాల నయం, అయినప్పటికీ మనలో ఈ లోపంవుంది. ఈ తప్పుడు ధోరణి వుంది. అత్యంత ముఖ్యమైన ఈ సమస్యను పరిష్కరించకపోతే మనల నెదుర్కొనే ఇతర సమస్యలను అంత సులభంగా పరిష్కరించలేం.

మన సారస్వతంలోను, కళారూపాలలోను వున్న సెక్టేరియనిజం కూడా ఒక ప్రధానసిద్ధాంతానికి సంబంధించిన సమస్యే. ఈ సెక్టేరియనిజంనుంచి బైట పడాలంటే మనం ఈ దిగువ నినాదంతో ముందుకు రావాలి.

"కార్మిక కర్షకులకోసం, సైనికులకోసం పనిచేయాలంటే ప్రజాసామాన్యంలోకి చొరబడాలి."

ఈ పాలసీని ఆచరణలో పెట్టడం ద్వారానే మన ఆశయాన్ని నెరవేర్చగలం. లేకుంటే ఈ సెక్టేరియనిజాన్ని మనం ఎప్పుడూ పరిష్కరించలేం.

లూహూసాన్ చెప్పినట్లు, ఒకే ఆశయం, ఒకే దృక్పథం అనేవి లేకపోవడం వల్లనే విప్లవవైజ్ఞానిక రంగంలో పనిచేసేవారిలో అనైక్యత వస్తోంది. ప్రజాసామాన్యంకోసం పనిచేయడమనే ఆశయమే దీనిని తొలగించుకోడానికి సాధనం.

ఇది అన్నిచోట్లా మనల్ని ఎదుర్కొంటున్న సమస్యే. పూర్వం షాంఘైలోను, ఇప్పుడు చుంకియాంగ్‌లోనూ కూడా ఇదే ప్రశ్న. కొన్ని చోట్ల ఇది మరీక్లిష్టంగా వుంది. కారణం అక్కడి అభివృద్ధికాముకులైన రచయితలూ, కళాకారులూ నిర్బంధాలతో అణచిపెట్టబడివున్నారు. ప్రజలతో సన్నిహితసంబంధం పెట్టుకోవడానికి వారికి అవకాశాలులేవు. మన ప్రాంతాలలోని పరిస్థితులు వేరు. మన విప్లవరచయితలకూ, కళాకారులకూ ప్రజలతోను, సైనికులతోను చక్కగా కలసి మెలసి పనిచేయడానికి మనం స్వేచ్ఛనిస్తాం. అవకాశాలు కలిగించుతాం. విప్లవసారస్వతాన్ని, కళలను సృష్టించడానికి సంపూర్ణ స్వాతంత్ర్యం ఇస్తాం. అందుచేతనే మన ప్రాంతాలలో ఈ సమస్యాపరిష్కారానికి చేరువలోకి వస్తున్నాం. సమస్యమాత్రం ఇంకా పరిష్కారం కాలేదనే విషయం జ్ఞాపకముంచుకోవాలి.

ఈ సమస్యను పరిష్కరించడానికి మార్క్సిజం - లెనినిజం అధ్యయనం జేయడం, ఆ వెలుగులో సమాజాన్ని పరిశోధించడం అనేవి తోడ్పడతాయి. మార్క్సిజం - లెనినిజం అంటే గ్రంధాలలో వుండే సిద్ధాంతాలు చదవడంకాదు. నేటి ప్రజా జీవితానికి, పోరాటాలకు అన్వయింపజేయబడిన సజీవసిద్ధాంతం. పుస్తకాలలోవున్న మార్క్సిజం, లెనినిజాన్ని ప్రజలకి అన్వయింపజేస్తే, ప్రజలలోకి తీసుకువెడితే అది సజీవ సిద్ధాంతం అవుతుంది. ఆపని చేయడంలో మనలోవుండే సెక్టేరియనిజం కూడా మాయమవుతుంది. దానితో ఒక సెక్టేరియనిజమే గాకుండా ఇంకా ఇతర సమస్యలుకూడా పరిష్కారమవుతాయి.

## ప్రచారం, సంస్కారం అనే సమస్యలు

ప్రజలకోసం పనిచేయడ మెలాగ? అనే ప్రశ్నకు వద్దాం. దీనినే మనకామ్రేడ్స్ సంస్కార సమస్య అనీ, ప్రచారసమస్య అనీ అంటూ వుంటారు.

ఇంతకు పూర్వం చాలమంది కార్మేడ్స్ ప్రచారసమస్యను-అంటే ప్రజలలో మన రచనలను వ్యాపింపజేయడమనే కర్తవ్యాన్ని నిర్లక్ష్యంగా వదలివేశారు. అదే సమయంలో సంస్కారం తీసుకురావడమనే కర్తవ్యాన్ని గోరంతలు కొండంతలు చేస్తారు. సంస్కార సమస్యయొక్క ప్రాముఖ్యతను గూర్చి హెచ్చరించవలసిన మాట నిజమే. కాని, ఆ విషయానికి ఉన్నదానికంటె ఎక్కువ ప్రాముఖ్యతను ఇవ్వకూడదు.

నేనిదివరకే చెప్పినట్లు ప్రేక్షకులను గూర్చిన సమస్యకు మనకింకా సరియైన పరిష్కారమార్గం దొరకలేదు. ఈసమస్య విషయమై ఆలోచించినప్పుడు కూడా పై సమస్యే తిరిగి ఇక్కడ ఉదయిస్తుంది. మనం ఎవరికోసం పనిచేయాలో మనకొక స్పష్టమైన దృక్పథం లేకపోవడంవల్ల ఈ సంస్కార కార్యక్రమానికీ, రచనలను ప్రజలలో వ్యాప్తిలోకి తీసుకువచ్చే పనికీ వున్నసంబంధం ఏమిటో నిర్ణయించే స్థాయి మనకు రాలేదు. ఇప్పుడు మనం సృష్టించే సారసత్వం, కళలు కార్మిక కర్షకులకోసం, సైనికులకోసం కనుక ఆ ప్రేక్షకుల్నే దృష్టిలో పెట్టుకొని, వాటిని వ్యాప్తిలోకి తీసుకురావడమనే విషయాన్ని చర్చించాలి. ఆ ప్రేక్షకుల్నే దృష్టిలో పెట్టుకొని సంస్కార విషయం కూడా ఆలోచించాలి.

మనం వ్యాప్తిలోకి తీసుకువచ్చే విజ్ఞానం ఏమిటి? ఫ్యూడల్ విజ్ఞానమా? బూర్జువావిజ్ఞానమా? లేక పెటీ బూర్జువా విజ్ఞానమా? ఇవి ఏవీ కావు. మనందేనినయినా ప్రజాసామాన్యంలో వ్యాప్తిలోకి తీసుకురావాలంటే అది వారివిజ్ఞానంద్వారానే చేయగల్గుతాం గాని మరోవర్గ విజ్ఞానం ద్వారాకాదు. అందుచేత కార్మికకర్షకుల్ని, సైనికుల్ని విజ్ఞానవంతులను చేయాలనే కార్యక్రమానికి పూనుకోడానికి ముందు మనం వారివద్దనుండి సంగతులను నేర్చుకోడమనే పనిని పూర్తి జేసుకోవాలి.

సంస్కారం తీసుకువచ్చే విషయంలోకూడా అదేవర్తిస్తుంది. దానికి ఎక్కడో ఒక చోట మొదలు పెట్టడమనేది జరగాలి. సారస్వతాన్ని గానీ కళలనుగానీ సంస్కరించాలంటే అవి ఏస్థాయిలో ఉన్నాయో తెలుసుకొని, ఆస్థితినుండి ఉన్నతస్థితికి వాటిని తీసుకుపోవాలి. ప్రస్తుతం వున్న స్థితి అన్నప్పుడు ఫ్యూడల్వర్గదశా బూర్జువావర్గ

దశా లేక పెటీ బూర్జువా వర్గదశా ఎక్కడనుండి అభివృద్ధి చేయాలి. యివి ఏవీ కానే కావు. మనం తీసుకోవలసినది.

మనం ఎక్కడనుంచి ఆరంభించాలి అనే విషయం అర్థంచేసు కుంటే ఎక్కువవ్యాప్తిలోకి తీసుకొావి రావలసిన విషయాలు. సంస్క రించవలసిన విషయాలు, ఏమిటో, ఏలాగో అర్థమవుతాయి రెండింటికీ మధ్యవున్న సరియైన సంబంధం ఏమిటో కూడా నిర్ణయించ గలుగుతాం.

విజ్ఞానం ఏస్థాయిలోవున్నప్పటికీ దానిరూపంమట్టుకు మన మనస్సులలో ప్రతిబింబించేదీ తయారుచేయబడేదీ అయిన ప్రజాజీవితం దానిలో వుంటుంది. ఆవిధంగా మనం సృష్టించే విప్లవ సారస్వతం లోను, కళా రూపాలలోను విప్లవకారులయిన రచయితలా, కళాకారులా మనస్సులలో ప్రతిబింబించేదీ, తయారు చేయబడేదీ అయిన ప్రజాజీవి తమే యిమిడి వుంటుంది.

గనులలో ముడిపదార్థంలోనుంచి మంచిలోహాన్ని తీసినట్లుగా ప్రజాజీవితంనుంచి ఉత్తమ సారస్వతం, కళలు రాబట్టవచ్చు. ప్రాథమిక దశలో అవి పాచీనంగా మోటుగాను వున్నప్పటికీ కొల్లలుగా ప్రజా జీవితంలో మనకవి లభిస్తాయి యిక్కడ మనకొక అంతులేని గని వున్నదన్నమాట. ఆ గనిలోనుంచి మనం ఎంతయినా త్రవ్వితీసుకో వచ్చు అది అక్షయం

చాలామంది ఒకప్రశ్న అడుగుతారు అచ్చుపుస్తకాలలో వుంటే సారస్వతం, కళలు - అంటేపురాతన రచనల సంపుటాలు. విదేశరచ నలు - కూడా మనకి ప్రోత్సాహమిచ్చేవిగాను, తరిఫీదు యిచ్చేవిగాను వుండవా?

నిజమే మనంవాటిని స్వీకరించవలసిందే. కవి ప్రధానమైన ఆధా రాలుగామాత్రం కాదు. వాటికి మనంప్రథమస్థానం ఇచ్చేపని ప్రారంభించా మంటే మనకి సరియైన దృక్పథం ఏర్పడదు. అంతా తల్లక్రిందులు కార్యక్రమంగా తయారౌతుంది పుస్తకాలుగాని, యితరత్రా లభ్యమయ్యే ప్రాచీనకస్వరూపాలుగాని గనులు కావు గనులనుండి తీయబడిన సరు కులు మాత్రమే. మన తాత ముత్తాతలు, విదేశరచయితలు-కళాకారులు, వాటిని తయారు చేశారు. వారి వారి కాలాల్లో ఆనాటి సమాజంలో

ప్రజాజీవితంనుంచి సారస్వతం, కళలూ ఎలా ఉద్భవిస్తాయో తెలిసిన వారు వాటిని తయారుచేశారు. వాటినుంచి మనం కొంత తీసిపారేయ వచ్చు. అద్దంలో ముఖం చూచుకొన్న తరువాత అద్దాన్ని అవతలపెట్టి నట్లు మనకు కావలసిన విషయాలను చూచుకొన్న తరువాత వాటి నొక ప్రక్కను పడేయాలి. మనకాలంలో మనసమాజంలో ప్రజాజీవితాన్నుంచి సారస్వతాన్ని కళలను తయారుచేయటానికి అన్వయాలుగా మాత్రమే ఆ గ్రంధాలను ఉపయోగిస్తాం. నిజం చెప్పాల్సివస్తే అలాంటి ఎరువుఅద్దాలలో చూచామా లేదా అనేది ప్రధానంకాదు. దాని వలన మనకు తెలిసేదల్లా నాగరికతకీ, అనాగరకతకీ వున్న తేడా. సంస్కరింపబడినదానికీ మొరటుదానికీ వున్నతేడా. వున్నతస్థాయిలో వున్నదానికీ, నిమ్నస్థాయిలో వున్నదానికీ వున్నతేడా. సహజంగా మనపూర్వులూ, విదేశస్థులూ తయారు చేసిన ఈ అద్దాన్ని మనం తిరస్కరించం. అది ఫ్యూడల్ వర్గానికిగాని, బూర్జువావర్గానికిగాని చెందివున్నప్పటికి మనం దాన్ని తోసిపుచ్చం. కాని ఒక విషయం మాత్రం గుర్తుంచుకోవాలి. నేటి ప్రజాజీవితాన్నిగూర్చి మనం చేసే పరిశోధనలకి బదులుగా మాత్రం దాన్ని ఉపయోగించకూడదు. అది ఉపయోగపడదుకూడా. ఎందుకంటే నేటి పరిస్థితిని, గతించినకాలం ప్రతిబింబింపజాలదు. ఈ విచక్షణ లేకపోయినా, దానిని గుడ్డిగా అనుకరించినా, లేదా యిప్పుడున్నదానికి బదులు ఆ మృతవిజ్ఞానాన్నిగాని విదేశ విజ్ఞానాన్నిగాని తెచ్చిపెట్టినా అది చాలా ప్రమాదానికి దారితీస్తుంది. మన సారస్వతంలోను, కళలలోనూ నిరుపయోగమైన మొండివాదనలను తెచ్చిపెడుతుంద.

అందుచేత విప్లవ రచయితలు, కళాకారులు తదితర వైజ్ఞానిక వర్కర్లు ప్రజాసామాన్యంలోకి వెళ్ళాలి. ఆ వెళ్ళడమనేది హృదయ పూర్వకంగాను. ఏ విధమైన సంకోచాలు, షరతులు లేకుండాను ఎక్కువ కాలం ప్రజలమధ్య పనిచేయడానికి సంసిద్ధంగానూ వెళ్ళాలి. అగ్ని పరీక్షలవంటి పోరాటాల్లో వెనుకాడకుండా నిలబడి పోరాడాలి. అంతులేని ప్రజాజీవితమనే గనియొక్క లోతులుచూడాలి. అన్నిరకాల ప్రజల్ని సంఘంలో అన్నితరగతులవారినీ, వారి జీవితాల్ని, వారి పోరాటాన్ని వారిలో ద్యోతకమయ్యే రకరకాల విజ్ఞానాన్ని పరిశీలించాలి. పరిశోధిం

చాలి, అవగాహనం చేసుకోవాలి. అలా చేయగలిగినప్పుడే నూతన విజ్ఞానాన్ని సృష్టించి తయారుచేసే విధానంలో ప్రవేశించగలుగుతాం. ఆ పద్ధతిలోనే ముడిపదార్థాలనుంచి మేలుసరుకులు తయారుచేయటం, పరిశోధనలనుంచి కొత్త విజ్ఞానాన్ని సృష్టించటం ఎలాగో తెలుసుకోగలుగుతాం. ఇదికాక మరో పద్ధతి నవలంబిస్తే రచయితగాను, కళాకారునిగాను, మనం పడే శ్రమంతా బూడిదలోపోసిన పన్నీరవుతుంది. ఎందుచేతనంటే, అసలు ముడిపదార్థమనేదే చేతులో లేకుంటే మేలుసరుకు ఎలా తయారవుతుంది? అలాచేస్తే మీరు వట్టి పోసుకోలు రచయితలు మాత్రమే అవుతారు. కళలేని కళాకారు లవుతారు. కీర్తిశేషుడైన టాహూసా చనిపోయేముందు తన కుమారుని కిచ్చిన హెచ్చరిక ఇదే.

ఆదర్శవంతమైన సారస్వతాన్ని, కళలనూ. సృష్టించటానికి ప్రస్తుతం అవి ఏ స్థితిలో ఉన్నాయో అదే దానికి ఆధారభూతమైనప్పటికీ ఆదర్శవంతమైనవానికంటె ఇప్పుడున్నవి ఎంతో సజీవమైనవి, ఉన్నతమైనవి అయినప్పటికీ, ప్రజలు ఇంకా ఆదర్శసారస్వతాన్నీ, కళలనూ మాత్రమే కోరుతారు. ప్రస్తుతమున్న సారస్వతంతోను, కళలతోను వారు సంతృప్తిచెందరు. అయితే దీనికి కారణమేమిటి? ఆదర్శవంతంగా తయారుచేయబడిన కళలు, సారస్వతమూ ఎక్కువ సిద్ధాంతయుక్తంగాను, విషయపరిజ్ఞానంలో కేంద్రీకృతమైనవిగాను, ఆదర్శంగాను వుంటాయి. అంతేకాక సాధారణంగా ఏ పరిస్థితికైనా అన్వయింపజేసుకోడానికి తగినట్లుగా వుంటాయి. అందుచేత వారికది నచ్చుతుంది.

ఉదాహరణకు. జీవించివుండే లెనిన్, ఒక నవలలోగాని, సినిమాలోకాని చిత్రించబడే లెనిన్‌కంటె ఎంతో శక్తివంతంగాను, అర్థసమన్వితంగాను వుంటాడు. కాని, జీవించివుండే లెనిన్ రేయింబవళ్ళు ఎంత కష్టపడి పనిచేసినా అది అందరూ చేసేపనిలాగే కనిపిస్తుంది. అంతేగాక బ్రతికివున్న లెనిన్‌ను అందరూ చూడడానికి అవకాశం వుండదు సరే, చనిపోయిన తరువాత ఆయన కనపడనే కనపడడుకదా! ఈ దృష్టితో ఆలోచిస్తే బ్రతికివున్న లెనిన్‌కంటె, నవలలోనో, చలనచిత్రంలోనో, కనబడే లెనిన్ ఎక్కువ శక్తివంతమైనవాడవుతాడు. అతని

ఆదర్శమూర్తి చదవనేర్చినవారికీ, సినిమా చూచేవారికీ, అందరికీ అందు బాటులో వుంటుంది.

విప్లవాత్మకమైన నవలలోగాని, నాటకంలోగాని, చలనచిత్రంలోగాని మనసాంఘిక జీవితానికి సంబంధించిన అనేక పాత్రలను సృష్టించవచ్చు. ప్రజలను ఎక్కువ విజ్ఞానవంతులను చేయడానికీ, చరిత్రను ముందుకు తీసుకు పోవడానికీ అవి తోడ్పడతాయి. ఉదాహరణకు నేడు మన సమాజంలో బాధలు పడేవారిని, ఆకలితో మాడేవారిని, అణచి పెట్టబడి దోచుకోబడేవారిని అనేకమందిని మనం చూస్తున్నాం. మరో పక్క తోటి మానవుని దోచుకొంటూ సర్వసౌఖ్యాలూ అనుభవించే భోగలాలసులనీ చూస్తున్నాం ఈస్థితి ఎంత వ్యాపితంగా వుందంటే ప్రజలంతా దీనికి అలవాటుపడిపోయి, ఇది ఇంతేలే అనేభావంతో జీవిస్తున్నారు. కాని రచయితలూ, కళాకారులూ, ఈ నిత్యజీవిత సంఘటనలనే సుపరిచితంగాను, విస్మయ యుక్తంగాను సృష్టించగలరు. తద్వారా ప్రజలలో ఉద్వేగం కలిగించగలరు. వారికి ప్రోత్సాహమివ్వగలరు. వారు తమ జీవిత పరిస్థితిని మార్చుకొని అభివృద్ధి చేసుకోడానికి ఐక్యమై పోరాటం సాగించేందుకు ముందడుగు వేయించగలరు. అవిధంగా మనం సారస్వతాన్నీ, కళలను తయారు చేయకుండా, అవి ప్రస్తుతం ఏ పరిస్థితిలో వున్నాయో అలాగే వుంచినట్లయితే మన కర్తవ్యం నెరవేరదు. కనీసం మనం అనుకున్నంత ఫలవంతంగాను, తొందరగాను నెరవేరదు.

ప్రజాసామాన్యంలో ఎక్కువ వ్యాప్తిచెందిన సారస్వతం, కళలూ సంస్కరింపబడిన సారస్వతం, కళలూ, ఈ రెండూ కూడా తయారు చేయబడినవే. అయితే ఈ రెండింటికీ వున్న తేడా ఏమిటి? అది తర, తమ భేదం తప్పితే మరోటికాదు. ప్రజలలో ఎక్కువ వ్యాప్తిచెందిన సారస్వతం, కళలూ ఎక్కువగా తయారైనవికావు. అవి కొంతవరకు మోటుగా వుంటాయి. వున్నప్పటికీ ప్రజాసామాన్యంచే తొందరగాను, సులభంగాను అర్థంచేసుకోబడేటట్లుంటాయి. ప్రజలకు ఇప్పుడున్న స్థాయిని బట్టి సంస్కరింపబడిన ఆదర్శ సారస్వతాన్ని, కళలను, తొందరగా గ్రహించలేరు, జీర్ణించుకోలేరు ఇవి యెక్కువగా మెరుగులు పెట్టబడినవిగా వుంటాయి. ఎక్కువ సంఖ్యలో తయారుచేయబడతాయి.

నేడు మనదేశంలో కార్మికకర్షకుల్ని, సైనికుల్ని ఎదుర్కొంటున్న అత్యవసర సమస్య, శత్రువుతో సల్పవలసిన తీవ్రయుద్ధం. ఎంతోకాలంగా ఫ్యూడల్, బూర్జువావర్గాల పాలనక్రిందపడి నలిగిపుండడం వల్ల, మన జనసామాన్యం ఎక్కువగా చదువను, వ్రాయను నేర్చుకోలేకపోయింది వారింకా అనాగరికంగానే వుండిపోయారు. అందుచేత వారికీనాడు వెంటనే కావలసింది విద్య, జ్ఞానం ఆ ఉద్యమం బయలు దేరాలి. వారి విజ్ఞానవిస్థాయిని, సారస్వతాన్ని కళలను అర్థం చేసుకోగలిగిన దశకు తీసుకురావాలి. ఈ సారస్వతం కళలు, వారికి అవగాహనమై పోరాటంలో వారికి నూతనోత్సాహాన్ని, నూతన శక్తిని కలిగించేదిగాను, అంతిమ విజయంలో విశ్వాసం కలిగించేదిగాను వుండాలి ఆ విధంగా వారిలో ఐక్యతను పెంపొందించి, వారంతా ఒకే హృదయంతో ఒకే ఆశయంతో శత్రువును ఎదుర్కొనేటట్లు చేయాలి. అందుచేత మనపని ఇప్పుడు సార్వతానికి. కళలకూ సంస్కారం పేరుచెప్పి నగిషీలు చెక్కడం కాదు. వాటిని ప్రజాసామాన్యంలోకి ఎక్కువగా ప్రచారంలోకి తీసుకొనిపోవడమే మన ప్రధమకర్తవ్యం. దీనిని తక్కువ అంచనా వేయడం చాలా ప్రమాదం.

ఏమైనప్పటికీ ఒకసంగతిమాత్రం మనం మరిచిపోకూడదు వ్యాప్తిలోకి తీసుకురావడం అనేది సంస్కరించడం అనేవి ఒకదానికొకటి సంబంధంలేని సమస్యలు కావు మన సారస్వతాన్ని కళలను ప్రజలలో వ్యాప్తిచేసేవారు వాటిలో ప్రజలకు దారిచూపుతూ ఒక అడుగు ముందుండాలి. లేకుంటే మనప్రచారానికి అర్థంవుండదు మన ప్రచార విధానం పదునూ పొదుగూ లేకుండా ఎప్పుడూ ఒకే పద్ధతిలో వుంటే అది నిష్ప్రయోజనం అప్పుడు మన ఉద్యమం "ఎక్కడున్నావే గొంగళీ అంటే వేసినచోటే వున్నాను" అనే స్థితిలోనే వుంటుంది. మన రచయితలు, "నీ పుర్రచెయ్యి తియ్యి, నా ఎడమచెయ్యి పెడతాను" అనే మాదిరిగానే మార్పుచెందుతూ వుంటారు. అంతే.

ప్రజలు మన సారస్వతాన్ని కళలను తమకు ఎక్కువగా అందాలని కోరుతారు అంటే అవి తమలో ఎక్కువ వ్యాప్తిచెందాలని కోరుతారు. కాని అదేసమయంలో అవి సంస్కరింపబడినవిగా వుండాలని

కూడా వాంఛిస్తారు. ప్రతినెలా, ప్రతిసంవత్సరం వాటిలో వారికి అభివృద్ధి కలబడుతూ వుండాలి. సారస్వతం కళలూ ప్రజలలో ఎక్కువ వ్యాప్తిచెందడమంటే ఎక్కువ విజ్ఞానవంతులను చేయడం ఎలా అవుతుందో అలాగే వాటిని సంస్కరించడ మంటే ప్రజలను సంస్కరించడమే అవుతుంది. సంస్కార మనేది గాలిలో జరిగేదికాదు. ఏ గదిలోనో నాలుగు గోడలమధ్య జరిగేవి అంతకన్నా కాదు. అది ప్రజలలో జరగవలసిన ప్రచారంమీద ఆధారపడి వుంటుంది. అందుచేత సంస్కారమనేది ప్రజలలో జరిగే వ్యాప్తిచేత నిర్ణయింపబడుతుంది. అదేసమయంలో ఆవ్యాప్తి చెందే విధానానికి ఇది దారిచూపుతూ వుంటుంది. ఆ రెండింటికీవున్న అవినాభావసంబంధం అది.

మన చైనావిషయమే తీసుకుందాం. చైనాలో విప్లవపరిణామము, దానితోపాటు విప్లవవిజ్ఞాన పరిణామము చాలా మెల్లిగాను, అసమాన స్థాయిలోను జరుగుతున్నాయి. కొన్ని ప్రదేశాలలో మన సారస్వతాన్ని కళలను ప్రజలలో వ్యాపింపచేయడం జరిగింది. ఆ ప్రాతిపదికమీదనే సంస్కారముకూడా ఆరంభించబడింది. మరికొన్నిచోట్ల అసలు ప్రజలలోకి వాటిని తీసుకుపోవడమనేదే మొదలుపెట్టబడలేదు. అందుచేత మొదటిప్రాంతాలలోని అనుభవాలు రెండోప్రాంతంలో పనిచేసేవారికి ఉపయోగపడతాయి. ఇక్కడ తప్పుదారులను పోయి అగమ్యగోచరస్థితిలో పడకుండా అనుభవాలు దారిచూపుతాయి. అంతర్జాతీయంగా చూస్తే, విదేశాలవారి అనుభవాలు, ముఖ్యంగా సోవియట్ యూనియన్‌లోని అనుభవాలు చాలవరకు మనకు మార్గదర్శకంగా వుంటాయి. ప్రజలలో వ్యాపింపచేయడంలోను సంస్కరించడంలోను ఎంతో తోడ్పడతాయి.

క్లుప్తంగా చెప్పాలంటే, సంస్కారమనేది ప్రజాసామాన్యంలో జరిగే ప్రచారంమీద ఆధారపడివుంటుంది. అలాగే ప్రజాసామాన్యంలో చేయబడే ప్రచారం ఈ సంస్కరణచే నడపబడుతూ వుంటుంది. ఈరెంటి విషయంలోను మనం అవలంబించే కార్యక్రమం ఇతరదేశాలలోని పద్ధతులను అనుసరించినదిగా వుండకూడదు గుడ్డిగా ఇతరదేశాలవారి పద్ధతులనే తుచ తప్పకుండా మనదేశంలో అమలు జరపడం చాల ప్రమాదం. అది ఒక్కొక్కప్పుడు మన ఉద్యమాన్నే నాశనం చేస్తుంది.

సంస్కరణ అనేది రెండు రకాలుగా వుంటుంది. ప్రజలకు ప్రత్యక్షంగా కావలసిన సంస్కరణ ఒకరకం. రెండోది పరోక్షమైనది. ఇది మనపార్టీ సభ్యులలో రావలసిన సంస్కరణ. మనపార్టీ సభ్యులంటే ప్రజా సామాన్యంలో అభ్యుదయకరమైన భాగం కనుక,వీరికది అవసరం.

మన పార్టీ సభ్యులు సాధారణంగా కొంత విజ్ఞానాన్ని పొంది వున్నారు. మామూలు ప్రజలకంటే విషయాలను అవగాహన చేసుకోవడంలో వీరు మెరుగు. అందుచేత సామాన్య ప్రజలలో ప్రచారం చేసే స్థాయితోనే వీరు సంతృప్తిపడరు. వీరిస్థాయి హెచ్చు, ఈ విషయాన్ని మనం మరచిపోకూడదు. అశ్రద్ధచేయకూడదు.

మన పార్టీ సభ్యుల యొక్క అవసరం ప్రజా అవసరాలకు కొంచెం వ్యత్యాసంగావున్నా, ప్రస్తుతానికి అది యింకా సంకుచితంగానే ఉంది. ఈ అవసరాన్ని మనం తీర్చాలి. కాని, కేవలం అదిఒక్కటే మన కార్యక్రమం కాకూడదు. మన కార్యక్రమంలో ఇదికూడా ఒక భాగంగా మాత్రమే వుండాలి. అదే సమయంలో మనం యింకో సంగతికూడా గుర్తించాలి ,మనపార్టీ సభ్యులకోసంమనం ఏమిచేసినా అది ప్రజలకోసం చేసినట్లే. ఎందుచేతనంటే ప్రజలను విజ్ఞానవంతులను చేసి నడిపేది మన పార్టీ సభ్యులే. మనం ఈ సూత్రాన్ని పిరాకరించి మన పార్టీ సభ్యులకు కావలసిన విషయ పరిజ్ఞానాన్ని యివ్వకపోతే వారు ప్రజల్ని గమ్య స్థానానికి నడపలేరు. అప్పుడు మనంచేసే పనంతా అడవిగాచిన వెన్నెల వుతుంది. ప్రజలకోసం పని చేయాలి అనే ప్రధాన సూత్రంనుంచే మనం దూరమై పోతాం.

ప్రజాజీవితం అనే గనినుంచి వచ్చిన సారస్వతం కళలు అనే ముడిపదార్థం విప్లవ రచయితలయొక్క, కళాకారులయొక్క చేతులలో పడి, ఒక ఆదర్శసారస్వతంగానూ, కళగానూ తయారై ఆప్రజలకే వుపయోగపడుతుంది. ఇలా తయారయేవాటిలో తక్కువ స్థాయిలో ఉండే ప్రజాసారస్వతం కళలనుండి ఎక్కువ స్థాయిగలవిగా అభివృద్ధి చేయబడినవీ, ఒక రకం వుంటాయి. ఇవి ప్రజలలో అందరికే కొంత అభివృద్ధిచెందని భాగానికి. ప్రధానంగా ప్రజల్లోవుండే మనపార్టీసభ్యులకు అవసరం, యిదికాక కొంత తక్కువ స్థాయిలోను, కొంత వెనుకబడి

నదిగానూ ఉండే ప్రజా సారస్వతం కళలూ కూడా వున్నాయి. ఇవి ఈ హెచ్చుస్థాయిగల ప్రజాసారస్వతంచేతనూ కళలచేతనూ సంస్కరింపబడుతున్నాయి. ఈరెండోరకం ప్రజాసామాన్యానికి నేడుఎక్కువగాకావాలి.

మన సారస్వతం కళలు, హెచ్చుస్థాయిలో వున్నాసరే,తక్కువ స్థాయిలో వున్నాసరే అవి ప్రజాసామాన్యంకోసం ముఖ్యంగా కార్మిక కర్షకులకోసం, సైనికులకోసం పనిచేస్తున్నాయి, మనం తయారుచేసేవన్నీ వారికోసమే గనుక, వారికవి ఉపయోగపడేవిగా వుండాలి! ఇప్పుడు మనం సంస్కరణకీ, వ్యాపింపచేయడానికీ వున్న సరియైన సంబంధం ఏమిటో తేల్చాం. దీనివల్ల పై రెండు కార్యక్రమాలలోనూ నిమగ్నులయ్యే నిపుణుల మధ్య వుండవలసిన సంబంధం ఏమిటోకూడా పరిష్కరించగలం. సంస్కరణ కార్యక్రమంలో పనిచేసే నిపుణులు కేవలం మన పార్టీ సభ్యులకోసమే కాకుండా, ప్రజాసామాన్యంకోసంకూడా పనిజేయాలి.

మాక్సిం గోర్కీ వివిధ ఫ్యాక్టరీలనుంచి వచ్చే కథలను ఎడిట్ చేస్తూనూ వుండేవాడు పత్రికలకు గ్రామాలనుంచి రిపోర్టులు పంపే వారిని ఆర్గనైజుచేస్తూనూ వుండేవాడు, యువకులైన రచయితలకు రచనా పద్ధతులను నేర్పుతూనూ వుండేవాడు. లూహూసాన్ తన కాలాన్ని ఎక్కువగా విద్యార్థులతో ఉత్తరప్రత్యుత్తరాలకోసం వినియోగించేవాడు. మన రచయితలు యువరచయితలకోసం ఎక్కువకాలం వినియోగించాలి. వారిసంఘాలను నిర్మించి వారిని అభివృద్ధిచేయాలి మన గాయకులు జానపదాలకోసం, సమష్టిగానాలకోసం ఎక్కువ టైము వినియోగించాలి. అలాగే మన చిత్రకారులు ప్రజల చిత్రకళకోసం ఎక్కువ కృషిచేయాలి. ప్రజా విజ్ఞానాన్ని వ్యాపింపచేయడానికి పనిచేసే కామ్రేడ్సుతో, పైన చెప్పిన అనుభవజ్ఞులంతా దగ్గరసంబంధం పెట్టుకోవాలి. వారికి ఈ నిపుణులు వారిచూస్తూ వుండాలి. కాని ఈ పనిచేసేటప్పుడు ఆ వర్కర్లవద్దనుంచి కూడా ఈ విషయాలు కొన్ని సంగతులు నేర్చుకోవాలి ఆ విధంగా తమ విజ్ఞానాన్ని, అనుభవాలను పెంపొందించుకొని ఎక్కువ అభివృద్ధి చెందుతూ వుండాలి. ఆ విధంగా తమ విజ్ఞానం అనుభవాలు, ప్రజల నుండి, యదార్థపరిస్థితులనుండి దూరం కాకుండా చేసుకోవాలి. తమ వూహాలన్నీ గాలిమేడలు కాకుండా చూసుకోవాలి

అనుభవజ్ఞులైన రచయితలను, కళాకారులను మనం గౌరవించాలి. వారి కృషి మనకు అమూల్యం. కాని వారికి ఒక విషయం కూడా జ్ఞాపకం చెయ్యాలి విప్లవ రచయితలు, కళాకారులు తమ రచనలకు ఒకఅర్థాన్ని, ఆకారాన్ని ఇచ్చి వ్యాపింపచేస్తున్నారంటే ప్రజలతో నిత్య సంబంధం పెట్టుకోడం ద్వారానే అది సాధ్యమౌతోంది. ప్రజల భావాలను బహిర్గతం చేయడం, వారికి మనమొక ప్రచార ఆయుధంగా పనిచేయడం మూలంగానే అది సాధ్యమౌతోంది. ప్రజలకు ప్రాతినిధ్యం వహించడం మూలంగానే వారిని విజ్ఞానవంతులను చేయగలం, ప్రజలకు శిష్యరికం చేస్తేనే వారికి గురువులం కాగలం. అలా కాకుండా ప్రజలకు పీఠాధిపతులమని లార్డులాగ వారి నెత్తిమీద కూర్చుందామనుకుంటే, నీవెంత గొప్పవాడవైనా సరే నీకెంత పాండిత్యం సామర్థ్యం వున్నా సరే, ప్రజలకు నీతో పనివుండదు, నీకూ, నీ రచనలకూ భవిష్యత్తు సున్నా.

అయితే మన యీ దృక్పథమూ ఉపయోగవాదమూ, (యుటిలిటేరియనిజం) ఒకటేనా ? అనే ప్రశ్న రావచ్చు. ఇంతవరకు జరిగిన సభా వేశాల్లో కొందరు కామ్రేడ్స్ మనం చేసే పనిలో కళకంటె విజ్ఞాన ప్రచారం ఎక్కువ వుండికనుక, ఇది ఉపయోగవాదమే అని వాదించారు.

మామూలుగా చూస్తే భౌతికవాదం (మెటీరియలిజం) ఉపయోగ వాదానికి (యుటిలిటేరియనిజానికి) వ్యతిరేకం కాదు. కాని, ప్యూడల్ వర్గం, బూర్జువావర్గాలదృష్టిలో ఉపయోగవాదాన్ని మనం పూర్తిగా వ్యతి రేకిస్తాం. ఎందుకంటే వారు వాదాన్ని పట్టి సంకుచితదృష్టితో స్వలాభం కోసం వినియోంచుకుంటారు ఏవర్గానికి సంబంధించకుండా అతీతమైన ఉపయోగవాదమనేది వుండదు. వర్గవ్యత్యాసాలతో నిండివున్న సమాజ ములో ఈ ఉపయోగవాద మనేది ఏదో ఒక వర్గానికి చెందినదిగానే వుంటుంది. మనది కార్మికవర్గానికిచెందిన విప్లవకరమైన ఉపయోగవాదం. ఇప్పుడూ, ఇకముందుకూడా ప్రజాసామాన్యం యొక్క శ్రేయస్సునే ప్రధానంగా పెట్టుకునే ఉపయోగవాదం మనది. అందుచేత మనం విశాల దృక్పథం కలిగిన, ఉత్తమఆశయంతో కూడిన విప్లవకరమైన ఉపయోగ వాదులం. ఒంటెత్తు రామలింగంలాగ అప్పటికప్పుడు, ఏదో ఒక లాభాన్ని పొందుతేచాలననే రకపు ఉపయోగవాదులం కాదు.

ఉదాహరణకి ఏదైనా ఒకరచన, ఆరచయితకీ, అతని మిత్ర బృందానికీ, లేదా ఇంకా కొద్దిమంది ఇతరులకీ మాత్రమే నచ్చేదిగా వుందనుకోండి అలాంటిది ప్రజా సామాన్యానికి పనికిరాదు. ఒక్కొక్క ప్పుడది వారికి అపకారిగాకూడ పరిణమించవచ్చు. ఎందుకంటే ఆరచయిత తనయొక్క, తన చిన్న ముఠాయొక్క ప్రయోజనాలకోసమే తన భావాలను వాటిలో ప్రచారం చేస్తాడు. అలాంటి వారే ఇతరులను ఉపయోగ వాదులని నిందిస్తారు. అలా చేసేవారే ప్రజలను అవమాన పరుస్తున్నారన్నమాట. అంతేకాదు వారు తమ్ము తాము అర్థంచేసుకోలేని దుస్థితిలో వున్నారన్నమాట.

ప్రజా సామాన్యంలో అధికసంఖ్యాకులకు లాభదాయకంగా వుండేది ఏదైనా మంచిదే. నీవు ప్రజల విజ్ఞానస్థాయిని పెంచకుండా, నీరచనలను వారు అర్థం చేసుకోలేక పోతున్నారని, వారు వెనుకబడి వున్నారని నిందించితే నీవెందుకూ పనికిరావు. పైన చెప్పినట్లు ఇది, సంస్కరించడం, ప్రజలలో వ్యాపింపజేయడం అనే రెండింటినీ సమన్వయ పరిచే సమస్య. ఈసమన్వయం లేకపోతే, నిపుణులైనవారు ఎంతఉత్తమ స్థాయికి చెందిన రచనలు తయారుచేసినా, అవి సంకుచితమైన ఉపయోగవాదంతో ఇమిడివుంటాయి. అలాంటి రచనలను నిర్మలమైనవనీ, ఉత్తమమైనవనీ మనం ఎంత పొగిడినా ప్రజలు మనతో ఏకీభవించరు.

ప్రధాన సమస్య అయిన ప్రేక్షకులు, వారికోసం ఎలాపనిచేయాలి అనేదానిని పరిష్కరించితే, మనస్థాన మెక్కడ ? మనం ఏ దృక్పథం తీసుకోవాలి ? ఏ విషయాలను తీసుకోవాలి ? మంచిని ఎక్కువగా వర్ణించాలా, చెడుగును ఎక్కువగా వర్ణించాలా ? ప్రజలతో కలిసిపోవాలా ? అవసరంలేదా ? ఉపయోగ వాదం అంటేఏమిటి ? సంకుచిత దృష్టితోను, స్వలాభాపేక్షతోను కూడిన ఉపయోగవాదమా ? వర్గాలకు అతీతమైన ఉపయోగ వాదమా ! లేక విశాల దృక్పథంతోను, దూరదృష్టితోనూ కూడిన ఉపయోగవాదమా ? ఏదికావాలి ? మొదలైన సమస్యలన్నీ పరిష్కారం చేయవచ్చు. మనం ఈ ప్రధాన సూత్రాన్ని అంగీకరిస్తే మన కల్చరల్ వర్కర్లు, మన సారస్వత తరగతులూ, ప్రచురణలూ, వైజ్ఞానిక దళాల నిర్మాణం, అన్నీకూడా ఆ పాలసీనే ఆచరణలో పెట్టాలి, అలా చేయక

పోవడం తప్పు. ఒకవేళ దానిని అమలులో పెట్టడంలో పొరపాట్లు సంభవిస్తుంటే వాటిని ఎప్పటి కప్పుడు సరిదిద్దుకుంటూ వుండాలి.

## వైజ్ఞానికరంగంలో జాతీయైక్య సంఘటన

ఇక మనపార్టీలో ఆంతరంగిక సంబంధాలు ఎలా వుండాలి అనే సమస్యను తీసుకుంటాం. అంటే మనపార్టీ మొత్తంగాచేసే పనికీ, దానిలో సారస్వతం. కళలూచేసే పనికీ వుండవలసిన సంబంధం ఏమిటి అనేది రెండోది. పార్టీకి వెలుపలనున్న వారితో మన సంబంధం ఏమిటి? అంటే మనపార్టీ సృష్టించే సారస్వతం, కళలూ, చేసేపనికీ, ఇతరులు తయారుచేసిన సారస్వతం, కళలూ చేసేపనికి వుండవలసిన సంబంధం. అంటే రచయితల రంగంలోను కళాకారులరంగంలోను నిర్మించవలసిన ఐక్యసంఘటన (యునైటెడ్ ఫ్రంటు) అన్నమాట.

మొదటి సమస్యను ముందు తీసుకుందాం. నేటి ప్రపంచంలో విజ్ఞానమంతా ఏదో ఒకవర్గానికి, ఏదో ఒక పార్టీకి, ఏదో ఒక రాజకీయ పంథాకు చెందివుంది. కళ కళకోసమే అనిగాని కళలు, సారస్వతం వర్గాలకూ రాజకీయాలకు పార్టీలకు అతీతమైన స్వతంత్ర విషయాలని గాని చెప్పుకునే రోజులు గతించాయి. వర్గవిభేదాలతోను. విభిన్న రాజకీయ పాలసీలతోను విండివున్న నేటి ప్రపంచంలో ఈ సారస్వతం, కళలు అనేవి ఏదో ఒక వర్గానికి, పార్టీకి చెందినవిగాను, వారి రాజకీయ హక్కులను కోరికలను ప్రతిబింబించేవిగాను. ఒక విప్లవవాతావరణంలో విప్లవకార్యక్రమాన్ని ప్రబోధించేవిగాను వుండవచ్చు. వీటితో దేనితోనూ సంబంధం లేకుండా వుంటే అవి ప్రజలతోనే సంబంధం లేనివిగావుండి పోతాయి.

కార్మికవర్గ సాహిత్యమూ, కళలూ ఆవర్గంయొక్క విప్లవకార్య క్రమంలో ఒకభాగం. లెనిన్ చెప్పినట్లు అది "యంత్రంలో ఒక మర మేకు వంటిది". మన పార్టీయొక్క విప్లవకార్యకలాపాల్లో పార్టీ సారస్వతమూ, కళలూ నిర్వహించే పాత్ర ఏమిటో ఇదివరకే నిర్దేశింప బడింది. అవి ఒక స్థానాన్నికూడా సంపాదించుకున్నాయి. ఈ పద్ధతిని వ్యతిరేకించడం.

అది "రాజకీయాలు మార్క్సిజంతో సమానం. కళలు కాపిట లిజంతో సమానం అనే ట్రాట్స్కీవాదానికి దారితీస్తుంది. సారస్వతం కళల యొక్క ప్రాముఖ్యతను గూర్చి అతిశయోక్తులతో కూడిన అభిప్రాయాలను మనం సహించం. అలాఅని వాటి పాత్రను తక్కువ అంచనా వేయుటనుకూడా అంగీకరించం. సారస్వతము కళలూ రాజకీయాలకు లోబడి వున్నప్పటికీ రాజకీయాలపై ఇవి ఎంతో ప్రభావాన్ని కలిగి వుంటాయి అవి మరమేకులు, యంత్రానికి మరమేకులు ఎలా విడిచి పెట్టరానివో. అలాగే ఇవి మన విప్లవోద్యమంలో విడిచిపెట్టరాని ఉపాంగాలు. కొంచెం విశాల దృష్టితో చూస్తే ఇవిలేనిదే విప్లవం కొనసాగడం కష్టం. విజయం పొందడం కష్టం. ఈ సత్యాన్ని గుర్తించక పోవడం చాలా పొరబాటు

అంతేకాదు. కళలూ సారస్వతమూ, రాజకీయాలకు లోబడి వుంటాయని మనంఅన్నప్పుడు మనవుద్దేశం కార్మికవర్గంయొక్క ప్రజాసామాన్యముయొక్క రాజకీయాలు. అంతే కాని రాజకీయపార్టీలని పేర్లు పెట్టుకొనే విప్లవవ్యతిరేకవాదుల ముఠాలు కాదు ఇక్కడ మనం చూడవలసినది రెండుపరస్పర విరుద్ధవర్గాలమధ్య జరిగే సంఘర్షణను గాని, కొద్దిమంది వ్యక్తుల ప్రవర్తన కాదు. భావాలమధ్య పోరాటం, సారస్వత పోరాటం. — ముఖ్యంగా విప్లవభావాలు, సారస్వతం కళలు జరిపే పోరాటం — రాజకీయాలపోరాటానికి లోబడే వుండాలి. ఎందుకంటే, రాజకీయాలద్వారానే కార్మికవర్గంయొక్క, ప్రజాసామాన్యంయొక్క అవసరాలు ఒక స్పష్టమైన స్వరూపంలో ప్రదర్శింపబడతాయి.

విప్లవ రాజకీయాలలో ఆరితేరిన రాజకీయ నిపుణులు, ప్రజాసామాన్యంలోనుండి వచ్చి పోరాటాలు జరుపుతూన్న వేలకొలది రాజకీయ సైనికులకు నాయకులు మాత్రమే. ఈ నిపుణులపని ఆపోరాడేవారి భావాలను కేంద్రీకరణం చేయుడం, వాటిని ప్రజలు అర్థంచేసుకునే విధంగాను ఆచరణయోగ్యమైనవిగాను తీర్చిదిద్ది తిరిగి వాటిని ప్రజాసామాన్యంలోకి పంపడం. ఈనిపుణులు బైటి ప్రపంచంతో సంబంధంలేకుండా నాలుగుగోడల మధ్య కూర్చొని బండిని తయారుచేసే వారిలాగ కాదు పనిచేయవలసింది. "మేం మేధావంతులం. ఇంట్లో కూర్చున్నా పైగ

జరిగేవన్నీ అర్థంచేసుకోగలం" అనేసాకులు పనికిరావు. ఇక్కడే కార్మిక వర్గ రాజకీయ వేత్తకీ, బూర్జువావర్గ రాజకీయవేత్తకీ ప్రధాన వ్యత్యాసం మనకి కనబడుతుంది. కార్మికవర్గ రాజకీయాలకీ బూర్జువావర్గ రాజకీయాలకీ వున్న అంతరంకూడా మనకక్కడ బోధపడుతుంది. ఈ తేడాను మనం గుర్తించకపోతే మన రాజకీయాలూ, రాజకీయ సైనికులూకూడా సంకుచిత స్వభావం గలవారుగా తయారవుతారు. రోజు రోజుకు దిగజారిపోతారు.

మనం చర్చించ వలసిన రెండో విషయం రచయితల. కళాకారుల జాతీయైక్య సంఘటన నిర్మించడం ఎలాగ? కళలు, సారస్వతం రాజకీయాలకు లోబడి వుంటాయి కనుకనూ, నేడు చైనా రాజకీయాలలో ప్రధాన సమస్య జపాను వ్యతిరేక పోరాటం కనుకనూ, మన రచయితలూ, కళాకారులూ ఇతర రచయితలతోనూ, కళాకారులతోనూ, ఆ ప్రాతిపదిక మీదనే ఐక్యసంఘటనను నిర్మించాలి. ఈ ఐక్యసంఘటనకూడా ప్రజాస్వామ్యసూత్రాలపైనే ఏర్పడాలి ప్రజాస్వామ్యసూత్రాలు గిట్టని ఇతర రచయితలూ, కళాకారులూ కొందరు ఈ ఐక్యసంఘటనలోకి రాకపోతే రాకపోవచ్చు శైలిలాంటి ప్రత్యేకసమస్యలపైకూడ మనం ఇతర రచయితలతో కలపవలసివుంటుంది. రచనలలోను కళలలోను కార్మికవర్గ వాస్తవికతవుండాలని మనంఅంటాం. దీనినికూడా కొంతమంది అంగీకరించక పోవచ్చు. వీటివల్ల ఈరంగంలో మనం నిర్మించే జాతీయైక్య సంఘటన ఆరంభంలో కొంతవరకు సంకుచితమైనదిగా వుండవచ్చు.

కొన్ని సమస్యలమీద ఐక్యత సమకూరినా, ఇతరులను మనం కొన్ని విషయాలలో విమర్శిస్తాం. ఇవన్నీ ఒకదానికొకటి వత్యాసమున్న సమస్యలైనప్పటికీ. వీటన్నిటినీ సమన్వయ పరచాలి. జాతీయైక్య సంఘటనలో పోరాటమూ, విమర్శనలూ అనే సమస్యతో పాటు జపానుకు వ్యతిరేకంగా ఐక్యమవడం అనే సమస్య కూడా వస్తుంది. ఈ ఐక్యసంఘటనలు పోరాటం సంగతి వదిలి పెట్టే వట్టి ఐక్యతగా తయారైనా. లేదా హృదయపూర్వకమైన ఐక్యత లేకుండా కేవలం పోరాటంకోసమే ఐక్యతగా తయారైనా అవి రెండు రకాల ప్రమాదాలకు దారితీస్తాయి. మితవాదపక్షం రాజీమార్గాన కొట్టుకుపోయి శత్రువుకు లొంగిపోదామనే స్థితికి రావచ్చు. లేదా అతివాదపక్షం సెక్టేరియన్ పోకడను పోవచ్చు.

వీటినే లెనిన్ "కుంటిపాలసీలు" అన్నాడు. ఇది ఒక రాజకీయాలకే కాకుండా సారస్వతానికి, కళలకూకూడా వర్తిస్తుంది.

ఈ వైజ్ఞానిక రంగంలో ఐక్యసంఘటనలోనికివచ్చే వివిధ శక్తులలో పెటీ బూర్జువా రచయితలూ, కళాకారులూ ఒక ప్రముఖ స్థానాన్ని ఆక్రమిస్తారు. వారిఆలోచనలూ రచనలూ కొన్ని లోపాలతోనూ బలహీనతలతోను కూడుకొని వుంటాయి. అయినప్పటికీ, బూర్జువావర్గం తోను ఫ్యూడల్ వర్గంతోను పోల్చిచూస్తే వీరు మెరుగె. వీరుఎక్కువగా విప్లవంవైపే మొగ్గుతారు. కార్మికకర్షకులకు, సైనికులకూ దగ్గరగా వుంటారు. వీరి బలహీనతలను పోగొట్టి లోపాలను సరిదిద్ది, వారు పూర్తిగా కార్మిక కర్షకుల, సైనికుల పక్షానికి వచ్చేటట్లు చేయడం చాల ప్రధానమైన కర్తవ్యం.

## విమర్శన ఎలా వుండాలి ?

వైజ్ఞానికరంగంలో విమర్శన అనేది పెద్ద ఆయుధం మనం దానిని పరిపూర్ణమైన దానినిగా చేసుకోవాలి. ఈ విషయంలో మనం ఇంతవరకు చేసిన పని చాలదు.

విమర్శన అనేది కొంచెం చిక్కులతోకూడిన సమస్య. దానికి ప్రత్యేక పరిశోధన కావాలి. ఇక్కడ నేను దానిలోని ప్రధాన విషయాన్ని గూర్చి మాత్రమే చర్చిస్తాను దానితోపాటు కొన్ని వ్యక్తిగత సమస్యలపై మన కామ్రేడ్లు అవలంబించే పొరపాటు దృక్పధాలను కూడా తెలుపుతాను.

కళలను. సారస్వతాన్ని విమర్శించడంలో రెండు ప్రమాణా లున్నాయి. ఒకటి రాజకీయ దృష్టితో చేసేది. రెండోది కళాదృష్టితో చేసేది.

రాజకీయ కొలబద్దతో చేసే విమర్శన ప్రకారం. జపాను వ్యతిరేక యుద్ధానికి లాభకరమైనదీ, ప్రజా ఐక్యతను పెంపొందించి వారంతా ఒకే ఆశయంతో ఒకే హృదయంతో పోరాటోన్ముఖులు అయ్యేటట్లు ప్రోత్సాహపరిచేదీ, వారి అజ్ఞానాన్ని పోగొట్టి విజ్ఞానాన్ని పెంపొందింప జేసేదీ, ఏదైనా మంచిదే అవుతుంది. అలా కాకుండా, జపాను వ్యతి

రేక యుద్ధానికి తోడ్పడనిదీ, ఐక్యతను పెంపొందించనిదీ, ప్రజలను నిరుత్సాహ పరిచేదీ, వారి అభివృద్ధిని వెనక్కి లాగివేసేదీ ఏదైన చెడ్డదే అవుతుంది.

మంచి, చెడ్డ అనేది దేనినిబట్టి నిర్ణయిస్తాం? రాసేవారి ఉద్దేశాన్ని బట్టా? లేక ఆరచనకలిగించే ఫలితాన్నిబట్టా? భావవాదులు (ఐడియ లిస్టులు) ఉద్దేశాలకే ఎక్కువ ప్రాధాన్యతనిస్తారు. ఫలితాలను వదలి పెట్టేస్తారు. అలాగే మెకానికల్ భౌతికవాదులు ఫలితాలకు మట్టుకే ప్రాధాన్యతనిచ్చి ఉద్దేశాల జోలికిపోరు.... మనం ఈ రెండింటినీ వ్యతిరే కిస్తాం. మనం - గతితార్కిక భౌతికవాదులం (డైలెక్టికల్ మెటీరియ లిస్టులం) ఉద్దేశాన్ని, ఫలితాన్ని సమన్వయించి చూడాలంటాం. ప్రజల కోసం పనిచేయాలనే ఉద్దేశంతో బయలుదేరితే దానిఫలితం వేరుగా వుండదు. ఒకవ్యక్తి లాభంగాని. ఒక చిన్న ముఠా ప్రయోజనంగాని సమకూర్చాలనే ఉద్దేశం మంచిదికాదు. అలాగే ప్రజలకోసం పనిచేయా లనే ఉద్దేశంతో ఆరంభించినా, ప్రజలు జీర్ణం చేసుకోలేని ఫలితాం నిస్తోందేమోననే విచక్షణ లేకపోయినా, అదీ మంచిదికాదు.

ఒక రచయిత యొక్క, కళాకారునియొక్క ఉద్దేశం సరియైన దవునాకాదా అనిగాని, మంచిదా చెడ్డదా అనిగాని నిర్ణయించవలసి వస్తే అతడేమని ప్రకటించుకున్నాడా అనేదికాదు మనం చూడవలసింది. అతని ప్రకటనమీద మనం ఆధారపడకూడదు. అతని ప్రవర్తనవల్ల సమాజంలో కలిగే ఫలితాలు ఏమిటా అని పరిశీలించాలి. రచయిత యొక్క కోరికను సంఘంలో అతని ప్రవర్తననుబట్టి నిర్ణయిస్తాం, అతని ఉద్దేశాన్ని దాని యొక్క ఫలితాన్నిబట్టి నిర్ణయిస్తాం.

మన విమర్శన సెక్టేరియనిజంతో కూడినదిగా వుండకూడదు. జపాను వ్యతిరేక పోరాటంలో మనతో కలిసి వచ్చేవారు, జాతీయైక్య సంఘటనలో వున్నవారు తమ తమ రాజకీయ దృక్పథాలతో వెలిబుచ్చే అభిప్రాయాలను సహించాలి. కాని మన విమర్శనలో కొన్ని ప్రధాన సూత్రాలను మట్టుకుపాటించవలసిందే: అంటే, జాతీయవ్యతిరేక భావాలతో గాని, అశాస్త్రీయమైనవి, ప్రజా వ్యతిరేకమైనవిగాగాని, కమ్యూనిస్టు వ్యతి రేక భావాలకోగాని వచ్చే రచనలను మనంతీవ్రంగా విమర్శించవలసిందే.

ఎందుచేతనంటే ఆ రచనల ఉద్దేశం, ఫలితాలూకూడా జాతీయైక్యతను విచ్ఛిన్నం చేసేవి, జపాను వ్యతిరేక పోరాటాన్ని బలహీనపర్చేవి అయి వుంటాయి.

ఇక, కళాదృష్టితో చేసే విమర్శనలకు కొలబద్ద యేమిటో చూద్దాం. ఉత్తమకళాసమన్వితమైనవన్నీ మంచివే అవుతాయి. కళావిహీన మైనవన్నీ చెడ్డవి అవుతాయి. కాని ఇవికూడా సమాజంమీద కలిగించే ఫలితాన్ని బట్టే వుంటాయి. చాలా కొద్దిమంది రచయితలు, కళాకారులు మాత్రమే తాము తయారుచేసినవి బాగాలేవుఅనేవిషయం గుర్తించగలరు. విమర్శనవిషయం తీసుకొంటే వివిధరచనలలోను, కళారూపాలలోను పోటీలురావడం మంచిది. కాని పోటీలకువచ్చినవాటిని విమర్శించడంలో మాత్రం సరిగా విమర్శించాలి. శాస్త్రీయమైన కళాదృష్టితోను, కొలబద్దతోనూ విమర్శించాలి. కొంచం తగ్గుస్థాయిలో వున్నవాటిని అభివృద్ధి చేయడానికి ఈపద్ధతి అవసరం.

విమర్శనలో రాజకీయ ప్రమాణం, కళాప్రమాణం అని రెండు కొలబద్దలున్నాయని అంటున్నాం. అయితే ఈ రెండింటికీ మధ్య, ఎలాంటి సంబంధం వుండాలి?

రాజకీయాలు కళతో సమానంకాదు. సామాన్యంగా ప్రపంచంపట్ల వుండే దృక్పథం కళాజనితమైన సిద్ధాంతంకాదు. ప్రజలతోను ఉద్యమం తోను సంబంధం లేక కదిలికలేని జడ పదార్థంలాంటి ప్రత్యేక రాజకీయాలనే వాటిని మనం అంగీకరించం. అలాగే దేనితోనూ సంబంధంలేని ప్రత్యేక కళా ప్రమాణాలనేవాటిని కూడా నిరాకరించుతాం. వివిధ వర్గ సమాజాలలోను, సమాజంలోని వర్గాలలోను వివిధరాజకీయ కళాప్రమాణా లున్నాయి. ఏది ఏమైనప్పటికీ, రాజకీయ ప్రమాణంతో చేసే విమర్శనయే ప్రాధాన్యత వహిస్తుంది. కళాప్రమాణంతో చేసేది రెండోదిగానేవుంటుంది.

బూర్జువావర్గం కార్మికవర్గ సాహిత్యాన్ని. కళారూపాలను అవి ఎంత ఎక్కువ కళాసౌష్టవంగా వున్నాసరే, నిరాకరిస్తుంది. అలాగే కార్మికవర్గం కూడా, బూర్జువా వైజ్ఞానికరూపాలు ఎంత కళాసమన్వితమైన వైనా సరే, నిరాకరించాలి. ఫాసిస్టులవంటి పచ్చి అభివృద్ధి నిరోధకుల వైజ్ఞానిక రూపాలు కూడా కొంతవరకు కళా సమన్వితంగానే వుంటాయనే

సంగతి మనం మరచిపోకూడదు. అవి ఎంతఎక్కువ కళా సౌష్టవంగా వుంటాయో ప్రజాసామాన్యానికి అంత ఎక్కువగా హానిచేస్తాయి. అందుచేత వాటిని విస్పంకోచంగా నిరాకరించాలి. దోపిడివర్గాలు తమ అవసాన దశలో తయారుచేసే సారస్వతంలోను, కళా రూపాలలోను, ఒక లక్షణంమాత్రం అన్నిటా మనకి కనబడుతుంది. అదేమంటే, అకళారూపాలకీ వాటిలో జొప్పింపబడే ఆవర్గ అభివృద్ధి నిరోధక రాజకీయాలకీ మధ్యవుండే వైరుధ్యం. విజానికిరెండూ అతకవు.

మనం, రాజకీయాలు కళతో కలిసి వుండాలనీ, కళారూపంతో విషయం కలిసివుండాలనీ అలాగే విప్లవరాజకీయాలను ఎంతఉత్తమ స్థాయికి చెందిన కళారూపంలో పొందుపర్చగలిగితే అంతచక్కగానూ ప్రదర్శింపబడాలని కోరుతాం. లేకుంటే అవిఎంతఅభ్యుదయ కరమైనవైనా నిర్జీవంగానే వుండిపోతాయి.

అందుచేత మనం, కళాసౌష్టంగావున్నా అభివృద్ధి విరోధక రాజకీయాలతో గూడిన కళారూపాలనూ తిరస్కరిస్తాం; చక్కని విషయంతో కూడివున్నా కళాసౌష్ఠవంగాలేక వట్టి వినాదాల బోర్డులు (ప్లేకార్డ్సు)లాగ వుంటే వాటినీ తిరస్కరిస్తాం. వైజ్ఞానిక రంగంలో ఈ రెండు శ్రేణుల తోనూ మనం పోరాటంజరపాలి.

విజానికి నేడు మన కామ్రేడ్స్‌లో ఈ రెండు ధోరణులూ వున్నాయి. చాలమంది ఈ విషయంలో ప్రాథమిక జ్ఞానమే లేకుండా వున్నారు. మీకుకొన్ని ఉదాహరణలు చూపుతాను.

1. "మానవ స్వభావం" అనే సిద్ధాంతం ఒకటి. అయితే మానవ స్వభావం అనేది లేదా ? అంటారు. వుంది. కాని అది ఒక నిర్దిష్టమైన స్వరూపం కలిగివుంది. వర్గాలతో కూడిన సమాజంలో మానవ స్వభావం అనేది ఆయా వర్గాల స్వభావం మాత్రమే. అంతేగాని వర్గ విభేదాలకు అతీతమైన ప్రత్యేక మానవ స్వభావం అనేదిలేదు.

మనం కార్మిక వర్గపు మానవ స్వభావా[illegible] మనదిగా చెబుతాం. అలాగే బూర్జువావర్గం, పెటీ బూర్జువావర్గం, [illegible]రి వర్గాల మానవ స్వభావపక్షం వహిస్తారు. అయినావారు అ[illegible]నలాగ దాపరికం లేకుండా చెప్పరు. తమది సాధారణ [illegible] మాత్రమేనవి

చెప్పుకుంటారు. అందుచేత వారి దృష్టిలో కార్మికవర్గపు మానవస్వభావం మామూలు మానవ స్వభావానికి విరుద్ధమని. యెనాన్‌లోకూడా ఈ "ప్రత్యేక మానవస్వభావ" సిద్ధాంతవాదులున్నారు. వారు తమ సారస్వతానికి, కళలకు ప్రాతిపదిక మానవస్వభావమే అని చెప్పుకుంటూ వుంటారు. ఈ సిద్ధాంతం పూర్తిగా తప్పు.

2. ఈసమావేశంలోనే ఒకరు ఇలా అన్నారు: "సారస్వతానికీ కళలకూ ప్రధానమైనది ప్రేమ. మానవజాతిని ప్రేమించడం" అని.

ప్రేమప్రధానమని దానితో ఆరంభిస్తే ఆరంభించవచ్చు. కాని అంతకంటె ప్రధానమైనవిషయం ఇంకోటి వుంది. ప్రేమ అనేది ఒక భావన. బాహ్యమైన ఆచరణయొక్క ఫలితం. మనం ప్రారంభించడమే అలాంటిభావనతో ప్రారంభించం. బాహ్యమైన ఆచరణతోనే ప్రారంభిస్తాం. మేధావి తరగతినుండి వచ్చిన రచయితలూ, కళాకారులూ కొందరు, కార్మికవర్గాన్ని ప్రేమిస్తున్నారంటే దానికి కారణం సమాజంలో కార్మికవర్గం లాగానే తాముకూడా అనాదరణంగా చూడబడడమే, దీని ఫలితంగానే తమజీవితాలను కార్మికవర్గ జీవితాలతో సమ్మిశ్రితంచేసుకున్నారు జపాను సామ్రాజ్యవాదులను మనంద్వేషించుతున్నామంటే వారు మనదేశంపై దురాక్రమణకు పూనుకోబట్టే. ప్రపంచంలో ఎక్కడా కారణంలేని ప్రేమ, కారణంలేని ద్వేషం వుండవు.

మానవజాతినంతనూ ప్రేమించడమనే విషయానికి వద్దాం. మానవ జాతి వర్గాలుగా ఎప్పుడైతే విడిపోయిందో, అప్పుడే సర్వ మానవప్రేమ అనేది పోయింది. నేడు అధికారంలోవున్న వర్గాలు ఈ నినాదాన్ని తీసుకుంటున్నాయి. కాన్‌ఫ్యూషియస్, టాల్‌స్టాయి ఈ సిద్ధాంతం కోసమే కృషిచేశారు. కాని ఎవ్వరూ సాధించలేకపోయారు. ఎందుకంటే ఈవర్గ సమాజంలో నేడది సాధ్యమయ్యేదికాదు. అయితే నిజమైన సర్వమానవ ప్రేమ అనేది సాధ్యం కానేకాదా అని అడగవచ్చు. అది సాధ్యమౌతుంది. నేడుకాదు. ప్రపంచమంతటా వర్గవిభేదాలు నిర్మూలించబడిన నాడే అది సాధ్యవ ది. ఈ వర్గాలే సమాజాన్ని చీల్చాయి. ఇవిపోతే మానవజాతి తిరిగి ంది. అప్పుడుసర్వమానవప్రేమ ఉంటుంది. అంతవరకూవు ం ఫాసిస్టులను, మనశత్రువులను

ప్రేమించం. సమాజంలో ఒక దుష్ట విధానాన్నికూడా ప్రేమించం. అలాంటి వాటినన్నిటినీ నిర్మూలించడమే మన ఆశయం. ఇది ప్రజల కుండే మామూలు ప్రపంచజ్ఞానం. మన రచయితలు, కళాకారులూ దీనిని అర్థం చేసుకుంటారా ?

3. ఈ సమావేశంలోనే ఇంకొకరు ఇలా అన్నారు: "సార స్వతం, కళలూ మంచినీ, చెడునూ సరిసమానంగా ప్రతిబింబిస్తాయి."

ఈ రిమార్కులో చాలా అస్పష్టమైన సమస్యలు ఇమిడివున్నాయి. మన సారస్వతమూ, కళలూ ఎప్పుడూ ఆ విధంగానే లేవు. చాలమంది పెటీబూర్జువారచయితలకు మంచి కనబడటమేలేదు. వారి రచనలన్నీ చెడుగునే వర్ణిస్తుంటాయి. ఇంకా కొంతమంది రచయితలు కేవలం నిరాశావాదాన్ని, తప్పించుకు తిరిగేధోరణిని ప్రచారం చేస్తారు.

సోషలిస్టు పునర్నిర్మాణ కాలంలో సోవియట్ సారసత్వం ప్రధా నంగా మంచినే వర్ణించేది. పొరపాట్లను చూపినా మంచిలో అవి ఒక భాగంగానే చూపేవారు. అంతేగాని మంచిసగం, చెడుసగం అనేది అక్కడలేదు.

అభివృద్ధి నిరోధక సమయాల్లో బూర్జువా రచయితలు విప్లవ ప్రజాసామాన్యాన్ని దోపిడీలు చేసే మూక అని వర్ణించారు. బూర్జువా వర్గాన్ని పవిత్ర మానవులని పొగడేవారు. ఇక్కడ మంచీచెడూ అనేవి, తల్లక్రిందు చేయబడ్డాయి.

వీటన్నిటివల్ల మనకు స్పష్టమయేది ఏమిటి? విప్లవ రచయితలూ, కళాకారులూ మాత్రమే, ఎప్పుడు పొగడాలి, ఎప్పుడు తెగడాలి, అనే సమస్యకు సరియైన పరిష్కారాన్ని సాధించగలరు. ప్రజాసామాన్యానికి ప్రమాదం కలిగించే దుష్టశక్తులన్నిటినీ ఖండించాలి. ప్రజల విప్లవ పోరా టానికి సంబంధించిన వాటినన్నిటినీ పొగడాలి. ఇదే విప్లవ రచయితల, కళాకారుల కర్తవ్యం.

4. "సారస్వతం కళలు - వీటిపని ఎల్లప్పుడూ ప్రతిదాన్నీ బట్ట బయలుచేస్తూ వుండటమే" అనేది మరొకవాదన.

పైదానిలాగానే, ఈవాదనలో కూడ చారిత్రకసత్యం శూన్యం. మొట్టమొదటి సంగతి, సారస్వతం కళలూ, ఎల్లప్పుడూ ప్రతిదాన్నీ బట్ట

బయలు చేయడానికి మాత్రమే ఉపయోగింపబడవు. విప్లవ రచయితలు, కళాకారుల విషయమే తీసుకుంటే వారు దురాక్రమణ దారులను, దోచుకునేవారిని, ఇతరులను అణచిపెట్టేవారిని బట్టబయలు చేయడమే ఆశయంగా పెట్టుకుంటారు. అంతేగాని ప్రజాసామాన్యాన్ని కాదు. విజావికి ప్రజలలో కూడా పొరపాట్లు వుండవచ్చు. కాని వారిలో ఆ లోపాలన్నీ దోపిడీదార్లు వారిపై సాగించే దుష్పరిపాలన ఫలితంగానే వస్తాయి. మన విప్లవ రచయితలూ, కళాకారులూ యీ లోపాలన్నిటినీ, దోపిడీవర్గాలు ప్రజాసామాన్యంపై గావించే దుర్మార్గాలుగానే చిత్రించాలి. ఇది ప్రజలలోపాలను బట్టబయలు చేయడం కానేరదు. ప్రజలసంగతే తీసుకుంటే, మన కర్తవ్యమంతా వారిని విజ్ఞానవంతులుగా చేయడం. ఉన్నతస్థితికి తీసుకొని పోవడం - ఇదే. విప్లవ వ్యతిరేకరచయితయిమాత్రమే ప్రజలను "మూఢులు" అని, "దోపిడీలు చేసే అల్లరిమూక" అని వర్ణిస్తారు.

5. "ఇది ఇంకా వ్యాసాల కాలమే. లూసాన్ రచనలలోని శైలి వాడడం ఇంకా అవసరమే" అనేది మరొకవాదన.

లూసాన్ వ్యాసాలు వ్యంగ్య రచనలు. వ్యాసాలు లూసాన్ శైలి, శత్రువుల గుట్టును బట్టబయలు చేయడానికి ఉపయోగించే ఒక పద్ధతి. లూసాన్ నిరంకుశపరిపాలనా దినాల్లో జీవించాడు; ఆ రోజుల్లో వాక్స్వాతంత్ర్యంలేదు. అందుచేత ఆయన వ్యంగ్యంతోకూడిన వ్యాసాలతో నిరంకుశ వ్యతిరేక పోరాటం సాగించాడు. అది సరియైన పద్ధతే.

చైనాలో ఫాసిస్టులను, అభివృద్ధి విరోధకముఠాలను వ్యంగ్య రచనలతో ఎదుర్కొవడం అవసరమే. కాని పూర్తి వాక్స్వాతంత్ర్యం వున్న షాన్-కాన్-నింగ్ బోర్డరు ప్రాంతంలో మనం వ్రాసే వ్యాసాలు, లూసాన్‌వాటిలాగ వ్యంగ్యధోరణిలోవుండకూడదు. అక్కడ మనం ప్రజాశత్రువులతో కాకుండా. ప్రజలతోనే వ్యవహరిస్తున్నాం. లూసాన్ కూడా తన వ్యాసాలలో ఎప్పుడూ విప్లవ ప్రజాసామాన్యాన్నిగాని, విప్లవ పార్టీలనుగాని ఆడిపొయ్యలేదు. వీరిని గురించి వ్రాసే అతని వ్యాసాలు ఇంకో రకమైన శైలిలో వుండేవి. నేనిందాక చెప్పినట్లు ప్రజలలోవుండే లోటుపాట్లను మనం విమర్శించాలి. కాని ఆ విమర్శన వారి విజ్ఞానస్థాయిని అనుసరించివుండాలి. వారిని విజ్ఞానవంతులను చేసేవిగాను, కాపాడేవి

గాను వుండాలి. మన కార్మికుడ్ని కూడా శత్రువును విమర్శించినట్లే విమర్శిస్తే, నీవూ ఒక శత్రువువే అవుతావుగాని కార్మికుడువు కావు.

అయితే ఇక మనం వ్యంగ్యరచనలు మానుకోవలసిందేనా ? అని కొందరడగవచ్చు. కాదు; వ్యంగ్యంలోకూడా రకాలున్నాయి. శత్రువుపట్ల ఉపయోగించేది ఒకరకం. మిత్రులపట్ల ఉపయోగించేది మరోరకం. మన పక్షంలో వుండే కార్మికుడ్ని ప్రజలపట్ల ఉపయోగించేది ఇంకోరకం. ఈ మూడురకాలవ్యంగ్యాలు మూడుప్రత్యేక దృక్పధాలు కలిగివుంటాయి. అంతేకాని, అసలువ్యంగ్యరచనావిధానాన్నే మానివేయాలని కాదు. దానిని తప్పుగా వాడకుండా వుండాలి.

6. "ప్రజావిజయాలను, వారిగుణగణాలను మనం పొగడనవసరము లేదు. మంచినే పొగుడుతూవుండే రచనలు తప్పనిసరిగా మంచి రచనలు అవుతాయని ఎక్కడాలేదు. అలాగే చెడుగును బట్టబయలుచేసే రచనలు తప్పనిసరిగా చెడ్డరచనలనీ లేదు" అనేది ఇంకొకవాదన.

నీవొక బూర్జువా రచయితవుగాని, కళాకారుడవుగాని అయివున్నట్లయితే, సహజంగానే నీవు కార్మిక వర్గాన్ని అభినందించవు. బూర్జువా వర్గాన్నే పొగడుతావు. అదే విధంగా నీవు కార్మికవర్గ రచయితవైనా, కళాకారుడివైనా సహజంగా కార్మిక వర్గాన్నే పొగడుతావు. కాని నీవు పై రెండింటిలో ఏదో ఒక రకమైన వాడివి కావాలి.

బూర్జువావర్గంలోని మంచిని పొగడుతూవుండే రచనలన్నీ తప్పనిసరిగా ఉత్తమ రచనలుకావు. అలాగే బూర్జువా వర్గంలోని చెడుగును బట్టబయలుచేసే రచనలన్నీ తప్పనిసరిగా తక్కువరకం రచనలుకానక్కరలేదు. కార్మికవర్గపు మంచిని వర్ణించే పద్ధతి ఆ రచనయొక్క ఉత్తమ గుణాన్ని ఏమీ తగ్గించదు. అలాగే చెడుగుమీద దాడి సల్పే రచనా విధానంకూడా దానిని కొంచపర్చదు. ఇక్కడ రచయితలను నేనొక ప్రశ్నవేస్తాను. ప్రపంచాన్నీ, ప్రపంచ చరిత్రనూ నిర్మించే ప్రజాసామాన్యాన్ని మనం ఎందుకు పొగడకూడదు ? నూతన ప్రజాస్వామ్యాన్ని, సోషలిజాన్ని, వాటి స్థాపనకోసం పోరాడే కార్మికవర్గాన్ని, కమ్యూనిస్టు పార్టీని మనం ఎందుకు అభినందించకూడదు ?

ఒక రకం రచయిత ఉన్నారు. వారికి ప్రజాసామాన్యంకోసం పనిచేయడమంటే ఉత్సాహం వుండదు. ప్రజాపోరాటాలను, ప్రజా విజయాలను గురించి మాట్లాడకుండా నిమ్మకు నీరెత్తినట్లు కూర్చుంటారు. ఇంక వారు చేసేపని అంతా తమ్ముతాము పొగడుకోవడం, తమను తాము అభివందించుకోడం మాత్రమే. అటువంటివారు పెటీ బూర్జువా వర్గానికి చెందిన అహంభావపూరితులు. వారికి అంతిమ ప్రజావిజయంలో విశ్వాసంలేదు. వారు విప్లవోద్యమానికి వేరు పురుగులు. విప్లవోద్యమానికి వీరు అవసరంలేదు.

(7) "ఇప్పుడు మనం నెదుర్కొనేది మనస్థానం ఎక్కడ అనే సమస్యకాదు. మనకు సరియైన దృక్పథమే వుంది. మన ఆశయం, ఉద్దేశంకూడా సరియైనవే. పోతే మనం విషయాన్ని చెప్పేరీతి మాత్రమే ప్రధానమైనది. ఎందుకంటే చెప్పేవిషయాన్ని సరిగా చెప్పలేక పోతే సత్ఫలితం కలగదు" అనేది ఒక వాదన.

ఉద్దేశం, ఫలితం అనే వాటినిగురించి ఇదివరకే స్పష్టంచేశాను. వాటికున్న అవినాభావ సంబంధాన్నికూడా గతితార్కిక భౌతికవాద రీత్యా వివరించాను. పోతే ఇప్పుడు, ఎలాంటి ఫలితం కలుగుతుంది. అనే సమస్య, మనస్థానం ఎక్కడ అనే సమస్యగాకూడా వుంటుందా వుండదా అని చూడాలి.

ఏదైనా ఒకరచన ఎలాంటి ఫలితాన్ని కలుగచేస్తుందో ఆలోచించకుండా రాసినవారి ఉద్దేశాన్ని మట్టుకే తీసుకుంటే. 'రోగం ఏమిటో తెలుసుకోకుండా మందునిచ్చే డాక్టరు' లాంటివాళ్ళమే అవుతాం, తాము యిచ్చే కార్యక్రమం ఆచరణసాధ్యమా కాదా అని ఆలోచించకుండా. ప్రణాళికలు ప్రకటించే రాజకీయపార్టీ లాంటి వారమే అవుతాం. ఒక రాజకీయపార్టీనిగురించిగాని, ఒకడాక్టరునుగురించిగాని మనం ఒక నిర్ణయానికి రావాలంటే వారి ఆచరణ ఎలావుంది అనే దాన్నిబట్టి ఆ నిర్ణయానికి వస్తాం. రచయితలూ, కళాకారులవిషయంకూడా అంతే. ఏదయినా ఒక ఉద్దేశం మంచిదవాలంటే ఆచరణలో పూర్వపు అనుభవంతోపోల్చి దాని ఫలితం ఎలా వుంది అనేది తెలిసి కోవాలి. ఉద్దేశించిన విషయం ఏరీతిగా చెప్పబడింది, అనేది పరిశీలించాలి,

మంచి ఉద్దేశం కలవారి లక్షణాలు తెలుస్తూనే వుంటాయి. వారు ఆత్మవిమర్శన చేసుకుంటారు. తమ రచనలలోని లోటుపాట్లను గుర్తించి వాటిని సరిదిద్దుకోవాలనే నిశ్చయంతో వుంటారు. నిజానికి ఇలా చేసుకుంటున్ననాడే వారు చేసేది సరియైనదిగా వుంటుంది. దానితోపాటు, ఆచరణలో మన రచనా ఫలితాలు ఎలా వుంటున్నాయి అనే సంగతిని ఒక బాధ్యతాయుతమైన దృక్పథంతో పరిశీలించి తెలుసుకుంటూ వుండాలి. అలా చేస్తూవుంటేనే నీకు రచనలలో సరియైన దృక్పథమంటే ఏమిటో, ఏ మార్గ మవలంబించాలో క్రమంగా అవగాహనమవుతుంది. నీ కార్యకలాపాల్లో ఈ విధానాన్ని అవలంబించకపోతే, నీకు ఏమీ అర్థంకాదు. అన్నీ అర్థమయ్యాయని నీవనుకుంటే అనుకోవచ్చు. కాని నీకు ఏమీ తెలియదు.

8. "మార్క్సిజం - లెనినిజాన్ని నేర్చుకోవడంవల్ల గతితార్కిక భౌతికవాద పద్ధతినే రాసే అలవాటుకు దారితీస్తుంది. ఇది రచయితలలో ఉద్భవించే నూతనభావాలకు హానికరం" అనే మరోవాదనకూడా వచ్చింది.

మార్క్సిజం - లెనినిజం నేర్చుకోడమంటే - ప్రపంచాన్ని, సమాజాన్ని సారసత్వాన్ని, కళనూ, గతితార్కిక భౌతికవాద దృష్ట్యా చూడడమే.

దానిఅర్థం, భౌతికవాద వేదాంతోపన్యాసాలను యథాతథంగా నీరచనల్లో పెట్టాలని కాదు.

మార్క్సిజం - లెనినిజం. సారస్వతంలోను కళలలోను వాస్తవికతను ఇముడ్చుతుంది. అంతేగాని మార్క్సిజానికి బదులుగా అవి ఉపయోగపడవు. ఉదాహరణకు మార్క్సిజం - లెనినిజంలో యాటం సిద్ధాంతంకూడా ఇమిడివుంది. అంతేగాని యాటం సిద్ధాంతాన్ని మార్క్సిజానికి బదులుగా తెచ్చిపెడితే ఉపయోగపడదు. సరుకులేని వట్టి పిడివాదం నూతన భావోదయాన్ని నాశనంచేసే మాటనిజమే. అది ఒక నూతన భావాలనే కాదు మార్క్సిజాన్ని కూడా దెబ్బకొడుతుంది.

అయితే, మార్క్సిజం - లెనినిజం నూతన భావోద్రేకాన్ని పాడుచేయదా? అని అడగవచ్చు. ఔను, పాడుచేస్తుంది. ఫ్యూడలిజంలోను, బూర్జువావర్గంలోను, పెటీ బూర్జువావర్గంలోను, అహంభావంలోను, అరా

విధానానికి వుండే తేడా వారికి తెలియదు। ఇవిరెండూ రెండు వేరువేరు ప్రదేశాలుగా వుండటమేకాదు. రెండు వేరువేరు చారిత్రక యుగాలనే ప్రతిబింబిస్తున్నాయి. షాంఘైలో వున్నది. బూర్జువా, జమీందారీ వర్గాల పరిపాలన క్రిందవున్న సెమీఫ్యూడల్, సెమీకలోనియల్ సమాజం. మన ప్రాంతాలలో కార్మికవర్గ నాయకత్వం క్రింద నిర్మింపబడిన నూతన ప్రజాస్వామిక సమాజం వుంది.

మన ప్రాంతాల్లోకి రావడమంటే కార్మికకర్షకుల, సైనికుల, ప్రజా సామాన్యంయొక్క పాలనక్రింద వున్న కొత్తరాజ్యంలో ప్రవేశించడం అన్నమాట. ఒక వెయ్యిసంవత్సరాల చరిత్రలో చైనాదేశం కనివిని ఎరుగని కొత్తరాజ్యంలో అడుగు పెట్టడమన్న మాట. అక్కడి ప్రజలంతా మారిపోయారు. ఇప్పుడక్కడ మన ప్రేక్షకులు పాతరకంకాదు. పాత కాలం గతించిపోయింది. అది తిరిగి రాదు. మనమిప్పుడు ఎట్టిసంకోచం లేకుండా ఆ నూతన ప్రజతో కలిసిపోవాలి

కొంతమంది రచయితలు "చైనాలోని ఇతర ప్రాంతాల (కొమింటాంగ్) పాఠకులకోసం మమ్మల్ని రాయనీయండి. మమ్మల్ని వారు ఎరుగుదురు. మారచనలు దేశానికంతకీ మేలు చేస్తాయి" అని అంటున్నారు.

ఈఆలోచన పూర్తిగా తప్పు.కొమింటాంగ్ ప్రాంతం కూడా మారుతోంది. అక్కడి ప్రజలకు ఇక్కడ మనప్రాంతంలో చెప్పబడే కథలే వల్లించ నవసరంలేదు. ఈ రచయితలు తమకు ఇంకా కొత్త కథలు చెబుతారని, ఇక్కడి ప్రజలను గురించి ఈ కొత్త ప్రపంచాన్ని గురించి చెబుతారని ఆప్రజలు ఆశిస్తారు. అందుచేత వారికి అందజేసే రచనల్లో మన ప్రజాస్వామ్య ప్రాంతాల ప్రజలను గురించి చెప్పడం అవసరం. అదివారికీ దేశానికంతకీ కూడా ఉపయోగకరం.

చైనా నేడు పురోగ మిస్తోంది, గాని వెనక్కి నడవడంలేదు. మన క్రిందనున్న ఈప్రాంతాలే ఆముందడుగుకు కారణం. అభివృద్ధి నిరోధకుల క్రిందనున్న కొమింటాంగ్ ప్రాంతాలుకాదు. అవి ఇంకా వెనుకబడే వున్నాయి.

మంచి ఉద్దేశం కలవారి లక్షణాలు తెలుస్తూనే వుంటాయి. వారు ఆత్మవిమర్శన చేసుకుంటారు. తమ రచనలలోని లోటుపాట్లను గుర్తించి వాటిని సరిదిద్దుకోవాలనే నిశ్చయంతో వుంటారు. నిజానికి ఇలా చేసుకుంటున్ననాడే వారు చేసేది సరియైనదిగా వుంటుంది. దానితోపాటు, ఆచరణలో మన రచనా ఫలితాలు ఎలా వుంటున్నాయి అనే సంగతిని ఒక బాధ్యతాయుతమైన దృక్పథంతో పరిశీలించి తెలుసుకుంటూ వుండాలి. అలా చేస్తూవుంటేనే నీకు రచనలలో సరియైన దృక్పథమంటే ఏమిటో, ఏ మార్గ మవలంబించాలో క్రమంగా అవగాహనమవుతుంది. నీ కార్య కలాపాల్లో ఈ విధానాన్ని అవలంబించకపోతే, నీకు ఏమీ అర్థంకాదు. అన్నీ అర్థమయ్యాయని నీవనుకుంటే అనుకోవచ్చు. కాని నీకు ఏమీ తెలియదు.

8. "మార్క్సిజం - లెనినిజాన్ని నేర్చుకోవడంవల్ల గతితార్కిక భౌతికవాద పద్ధతినే రాసే అలవాటుకు దారితీస్తుంది. ఇది రచయితలలో ఉద్భవించే నూతనభావాలకు హానికరం" అనే మరోవాదనకూడా వచ్చింది.

మార్క్సిజం - లెనినిజం నేర్చుకోవడమంటే - ప్రపంచాన్ని, సమాజాన్ని సారస్వతాన్ని, కళలనూ, గతితార్కిక భౌతికవాద దృష్ట్యా చూడడమే.

దానిఅర్థం, భౌతికవాద వేదాంతోపన్యాసాలను యథాతథంగా నీరచనల్లో పెట్టాలని కాదు.

మార్క్సిజం - లెనినిజం. సారస్వతంలోను కళలలోను వాస్తవికతను ఇముడ్చుతుంది. అంతేగాని మార్క్సిజానికి బదులుగా అవి ఉపయోగపడవు. ఉదాహరణకు మార్క్సిజం - లెనినిజంలో యాటం సిద్ధాంతంకూడా ఇమిడివుంది. అంతేగాని యాటం సిద్ధాంతాన్ని మార్క్సిజానికి బదులుగా తెచ్చిపెడితే ఉపయోగపడదు. సరుకులేని వట్టి పిడివాదం నూతన భావోదయాన్ని నాశనంచేసే మాటనిజమే. అది ఒక నూతన భావాలనే కాదు మార్క్సిజాన్ని కూడా దెబ్బకొడుతుంది.

అయితే, మార్క్సిజం - లెనినిజం నూతన భావోద్రేకాన్ని పాడు చేయదా? అని అడగవచ్చు. ఔను, పాడుచేస్తుంది. ఫ్యూడలిజంలోను, బూర్జువావర్గంలోను, పెటీ బూర్జువావర్గంలోను, అహంభావంలోను, అరా

జకవాదంలోను, కళకళకోసమే అనే వారిలోను, నిరాశావాదులలోను మొలకలెత్తే ప్రమాదకరమైన నూతన భావాలను నాశనం చేస్తుంది. అలాంటి అభివృద్ధి నిరోధకభావాలు కొత్తవైనా పాతవైనా నాశనం చేయబడవలసినవికాదా? నా ఉద్దేశంలో అవి నాశనం కావాలి. పూర్తిగా నాశనంకావాలి. వాటిస్థానే విప్లవాత్మకమైన కార్మికవర్గ నూతన భావాలు మొలకలెత్తాలి అవి వస్తాయి కూడ.

## మూడు పెద్దలోపాలు

నే నింతవరకు చెప్పిన సమస్యలన్నీ యెనాన్‌లోని మన వైజ్ఞానిక దళాలలోవున్నవే. ఇది దేనిని తెల్పుతోంది? ఇది మూడు పెద్ద లోపాలను తెల్పుతోంది. అవి వ్యక్తివాదం (సబ్జక్టివిజం) సెక్టేరియనిజం, చిలక పలుకుల్లాగ పార్టీ సమాసాలలోనే ప్రతి విషయాన్ని చెప్పడం.

భావవాదం భ్రమలు, పిడివాదాలు చేయడం, చెత్తవాగుడు, సెక్టేరియనిజం ఆచరణలో అశ్రద్ధ మొదలైన జబ్బులు మనకామ్రేడ్స్‌లో కూడ చాలమందికి వున్నాయి. మన పద్ధతులను సరిదిద్దుకోడానికి తీవ్ర కృషి అవసరం.

చాలామంది కామ్రేడ్స్. కార్మికవర్గానికీ, పెటీ బూర్జువా వర్గానికీ వున్న వ్యత్యాసాన్ని స్పష్టంగా తెలుసుకోలేని స్థితిలో వున్నారు. చాల మంది కామ్రేడ్స్ నిర్మాణరీత్యా పార్టీలో (సభ్యులుగా) చేరారు. కాని వారంతా సిద్ధాంతరీత్యా ఇంకా పార్టీలో మిళితంకాలేదు. వారికింకా పార్టీ ఆలోచనా పద్ధతి పట్టుబడలేదు. వారికి కార్మికవర్గ మనస్తత్వం అంటే ఏమిటో, కమ్యూనిజంఅంటే ఏమిటో, పార్టీఅంటే ఏమిటో, ఇంకా తెలియదు.

ఇంకా ఇతరరకాల మనుష్యులుకూడా వున్నారు. జపానుపక్షం. వాంగ్-చింగ్-వీ పక్షం వహించినవారూ, బూర్జువావర్గ గూఢచారులైన వారూ కూడా మేకతోలు కప్పుకున్న పులులలాగ వున్నారు. వీరు క్రమ క్రమంగా కమ్యూనిస్టు పార్టీలోకి. పార్టీనడిపే ప్రజాసంఘాలలోకి దూరే ప్రమాదంకూడా లేకపోలేదు. వీరు ప్రజలముందు విప్లవ వాదుల్లాగ, కమ్యూనిస్టుల్లాగ ముద్రలువేసుకు తిరుగుతారు.

మన పార్టీలో కామ్రేడ్స్ ఎక్కువమంది నమ్మకస్థులే అయినా, పార్టీ నిర్మాణంలో కొంత అంతరంగిక పరిశుద్ధి అవసరం. ఈ పరిశుద్ధి నిర్మాణంలోనే గాక మన ఆలోచనా విధానంలో కూడా జరగాలి. అప్పుడే మనపార్టీ తొందరగా అభివృద్ధి చెందగలదు. విప్లవోద్యమం ముందుకు పోగలదు.

ఈ విధంగా మనపార్టీ నిర్మాణాన్ని చక్కబరచుకోడానికి. మానసికంగాకూడ మనం తయారుకావాలి. ఎందుచేతనంటే కార్మికవర్గభావాలకి ఇతరవర్గాలభావాలకి మధ్య పోరాటాలు సల్పవలసివుంటుంది. ఈ భావాల మధ్య పోరాటం ఇప్పుడు మన సారస్వతరంగంలోను, వైజ్ఞానికరంగంలోను ప్రారంభమైంది. ఇది చాల ముఖ్యమైన పోరాటం.

పెటీబూర్జువావర్గంనుంచి వచ్చినవారు, సారస్వతంద్వారాను, కళంద్వారాను, ఇంకా అనేక ఇతర విధాలా తమ భావాలను ప్రచారం చేస్తూ కమ్యూనిస్టుపార్టీకూడా వారి సూచనల ప్రకారం పునర్నిర్మాణం చేసుకోవాలని కోరుతూ వుంటారు. వారికి మనం గట్టిగా చెప్పే సమాధానం ఇది :

"కామ్రేడ్సు! మీరవలంబించే పద్ధతి మంచిదికాదు. కార్మికవర్గమూ ప్రజాసామాన్యమూ మీరు కోరినట్లుగా మీ భావాలకు అనుగుణ్యంగా మారరు. మీరు కోరినట్లు జరగడమంటే బూర్జువావర్గ వాంఛ యీడేరినట్లే. మీ సూచనలు పాటించడమంటే మా పార్టీని రద్దు చేసుకోడమే అవుతుంది. పార్టీనేకాదు; దేశాన్నే నాశనం చేయడమవుతుంది. చివరకు మీ తలకాయలుకూడ చెడటమే అవుతుంది. అయితే ప్రజలు ఎవరి దృక్పథం ప్రకారం సరిదిద్దబడాలి? కార్మికవర్గ దృక్పథం ప్రకారము, దాని ప్రథమశ్రేణియైన కమ్యూనిస్టుపార్టీ దృక్పథం ప్రకారమే ఆ పని జరగాలి.

మరికొందరు కామ్రేడ్స్‌లో కొంత మానసిక గందరగోళంకూడా వుంది. వారు ప్రజా స్వామ్య విధానాన్ని అనుసరించుతున్న మన ప్రాంతాలకీ, దేశంలోని ఇతర ప్రాంతాలకీవుండే భేదంఅర్థం చేసుకోలేక వారు గందరగోళంలో పడివున్నారు. వారుచేసే పొరపాట్లు అన్నింటికీ ఇదే మూలం. వారు షాంఘైలోని సౌధోపరిభాగాలనుంచి ఈ మధ్యనే దిగివచ్చారు. ఆ షాంఘై సౌధాలకీ, మన ప్రాంతంలో వుండే జీవిత

విధానానికి వుండే తేడా వారికి తెలియదు। ఇవిరెండూ రెండు వేరువేరు ప్రదేశాలుగా వుండటమేకాదు. రెండు వేరువేరు చారిత్రక యుగాలనే ప్రతిబింబిస్తున్నాయి. షాంఘైలో వున్నది. బూర్జువా. జమీందారీ వర్గాల పరిపాలన క్రిందవున్న సెమీఫ్యూడల్, సెమీకలోనియల్ సమాజం. మన ప్రాంతాలలో కార్మికవర్గ నాయకత్వం క్రింద విర్మింపబడిన నూతన ప్రజాస్వామిక సమాజం వుంది.

మన ప్రాంతాల్లోకి రావడమంటే కార్మికకర్షకుల, సైనికుల, ప్రజా సామాన్యంయొక్క పాలనక్రింద వున్న కొత్తరాజ్యంలో ప్రవేశించడం అన్నమాట. ఒక వెయ్యిసంవత్సరాల చరిత్రలో చైనాదేశం కనివిని ఎరుగని కొత్తరాజ్యంలో అడుగు పెట్టడమన్న మాట. అక్కడి ప్రజలంతా మారిపోయారు. ఇప్పుడక్కడ మన ప్రేక్షకులు పాతరకంకాదు. పాతకాలం గతించిపోయింది. అది తిరిగి రాదు. మనమిప్పుడు ఎట్టిసంకోచం లేకుండా ఆ నూతన ప్రజతో కలిసిపోవాలి

కొంతమంది రచయితలు "చైనాలోని ఇతర ప్రాంతాల (కొమింటాంగ్) పాఠకులకోసం మమ్మల్ని రాయనీయండి. మమ్మల్ని వారు ఎరుగుదురు. మారచనలు దేశానికంతకీ మేలు చేస్తాయి" అని అంటున్నారు.

ఈఆలోచన పూర్తిగా తప్పు.కొమింటాంగ్ ప్రాంతం కూడా మారుతోంది. అక్కడి ప్రజలకు ఇక్కడ మనప్రాంతంలో చెప్పబడే కథలే వల్లించ నవసరంలేదు. ఈ రచయితలు తమకు ఇంకా కొత్త కథలు చెబుతారని, ఇక్కడి ప్రజలను గురించి ఈ కొత్త ప్రపంచాన్ని గురించి చెబుతారని ఆప్రజలు ఆశిస్తారు. అందుచేత వారికి అందజేసే రచనల్లో మన ప్రజాస్వామ్య ప్రాంతాల ప్రజలను గురించి చెప్పడం అవసరం. అదివారికీ దేశానికంతకీ కూడా ఉపయోగకరం.

చైనా నేడు పురోగమిస్తోంది, గాని వెనక్కి నడవడంలేదు. మన క్రిందనున్న ఈప్రాంతాలే ఆముందడుగుకు కారణం. అభివృద్ధి నిరోధకుల క్రిందనున్న కొమింటాంగ్ ప్రాంతాలుకాదు. అవి ఇంకా వెనుకబడే వున్నాయి.

కామ్రేడ్స్। మనలను మనం సరిదిద్దుకోడంలో ఈ ప్రధాన విషయాన్ని తప్పక గుర్తించాలి. మనం ఈ కొత్త ప్రజాయుగంలోకి ప్రవేశించ వలసివుంది. గనుక వ్యక్తికీ, ప్రజా సామాన్యానికీ వుండవలసిన సంబంధం ఎటువంటిది, అనే సమస్యను సాకల్యంగా చర్చించి పరిష్కరించాలి. లూసాన్ గేయంనుంచి ఒక చరణం మన కిక్కడ బాగా ఉపకరిస్తుంది.

"వేలెట్టి చూపుదురుగాక
వేయిమంది నీకేసి,
వెరువకుము వెరపెందుకోయి
చొరవ విడువక నీవు
కృషిచేయు భవిష్యజాతికొరకు"

అదే మన వినాదంగా వుండాలి. మన శత్రువులు వెయ్యిమంది వున్నా సరే, వారెంత భయంకరమైనవారయినాసరే మనం వారికి వెరువం. వారు మనలను లొంగదీయలేరు. భవిష్యజాతి అంటే ఇక్కడ కార్మిక వర్గం. ప్రజాసామాన్యం. మనం వారికోసం పనిచేస్తాం ప్రతి పార్టీ సభ్యుడూ, విప్లవ రచయితా, కళాకారుడూ విరామం లేకుండా ఆమరణాంతం నడుమువంచి అందుకోసం పనిచేయాలి. మేధావులైనవారు తమ జీవితాలను ఈ కొత్త ప్రజాజీవితంతో సమ్మిళితమొనర్చుకోడానికి ఎంతో కష్టనష్టాలకు గురికావలసివుంటుంది. ఎంతో శ్రమపడవలసివుంటుంది. వారిలోవారు ఎంతో ఆత్మసంఘర్షణ జరపవలసివుంటుంది. కాని మన ఆశయాన్ని సాధించాలి అనే పట్టుదల, మనోనిశ్చయంవున్నచో తప్పక జయంపొంది తీరుతాం.



* రాజకీయ

* ఆర్థిక

* సాంఘిక

* విజ్ఞాన

## గ్రంథాలకు

**ప్రజాశక్తి ప్రచురణాలయం**

**బెజవాడ**

పూర్తి కేటలాగు
వ్యాపార నియమాలకు
నేడే వ్రాయండి

---

* అందమైన పనులకు

* సరసమైన రేట్లకు

* సకాలంలో
పని పూర్తి
చేయటానికి

## ప్రజాశక్తి ప్రెస్

మొగల్ రాజపురం

**బెజవాడ**

---

**యదార్థ వార్తలకు**



**వ్యాపార ప్రకటనలకు**



**రాజకీయ వ్యాసాలకు**

## ప్రజాశక్తి

కమ్యూనిస్టు దిన పత్రిక

మొగల్ రాజపురం, బెజవాడ

చందా వివరాలు :

| | |
|---|---|
| సంవత్సర చందా రు | 24-0-0 |
| విడిపత్రిక (6 పేజీలు) | 0-1-0 |
| వారపత్రిక సం॥ చందా | 9-0-0 |
| వారపత్రిక | 0-3-0 |



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA119B128 |
| పుస్తకం పేరు | వైజ్ఞానికరంగంలో |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 51 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | 1,2 |
| తయారు చేసినది | Apsar |
| పేజీలు విడదీసినది | Apsar |
| స్కాన్ చేసినది | S.K. Ramya |
| పరీక్ష చేసినది | ROHITH |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |